# కృష్ణశాస్త్రి

## బదరిక



ఓరియంట్ లాజ్మన్

ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్

*రిజిస్టర్డ్ కార్యాలయం*

3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

*ఇతర కార్యాలయాలు*

బొంబాయి కలకత్తా మద్రాసు కొత్త ఢిల్లీ
బెంగుళూరు హైదరాబాద్ పాట్నా
గౌహతి లక్నో భువనేశ్వర్


**ISBN 0 86125 958 0**

*ప్రచురణ*

ఓరియంట్ లాఙ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

*టైప్‌సెట్*

కోరెస్ కమ్యూనికేషన్స్, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

*ముద్రణ*
ట్విన్ సిటీస్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ హైదరాబాద్.

# మా మాట

సాహిత్యం వెన్నెల బాటయితే కృష్ణశాస్త్రి కవిత ఆ మార్గాన పరుగులు తీసే వెండి రథం. ఆయన కలం వెలార్చిన ప్రతి కవిత ప్రతిపదం మీ ముందుకు తేవాలనే మా ప్రయత్నంలో అముద్రితాలైన అరుణరథం, కొత్తకోవెల, బదరిక, మూగనయాక, విద్యాపతి మొదలైన వాటి ప్రచురణలలో మేం రవ్వంత ఇబ్బంది పడిన మాట వాస్తవం. ఎలా అంటే ఈ వ్రాతప్రతులు ఎప్పుడో ట్రంకు పెట్టెల్లో భద్రపరచడం వల్లనూ, కాగితాలు పాతవై పోయి పట్టుకుంటే చిరిగిపోయే శిథిలావస్థలో ఉండడం వల్లనూ, ఇంకు పెన్నుతో రాయడంతో కొన్ని అక్షరాలు చెరిగిపోవడం వల్లనూ, కొన్ని అసంపూర్ణంగా వదిలేసి ఉండడం వల్లనూ మాకు ఇబ్బంది కల్గింది. అందువల్ల వాటిని భావం మారకుండా, అర్థవంతంగా ఉండడంకోసం కొన్ని చోట్ల మార్పులు, చేర్పులు చేయవలసి వచ్చింది.

అసలు వీటన్నిటినీ సంకలనం చేసి, సంపాదకీయ బాధ్యతలను చేపట్టి ఉత్తరాల ద్వారా మాకు సలహాలు, సూచనలు అందజేసిన బాలాంత్రపు నళినీ కాంతరావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రూఫులు దిద్దడంలో మాకు సహాయాన్నందించిన బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారికీ, ఇస్మాయిల్ గారికీ మా ప్రత్యేక కృతజ్ఞతలు. మిగిలిన పుస్తకాల కంటే ఈ పుస్తకాల ప్రచురణలో మేం కొంచెం ఎక్కువ శ్రమే పడవల్సి వచ్చింది. అయినప్పటికీ ఈ పుస్తకాలు మీ ముందుకు తేగలిగిన ఆనందం ముందు అది తక్కువే అన్పిస్తుంది. నిజానికి కృష్ణశాస్త్రి లేని లోటు కొట్టొచ్చినట్టు కనిపించింది. ఆయన వెండిరథాన్ని ఒడిదుడుకులు లేని బాటలో నడిపించాలని మేం చేసిన ఈ ప్రయత్నంలో మీకుగానీ ఇబ్బంది కల్గితే అదికేవలం రథసారథి లేకపోవడంవల్ల మాత్రమేనని సాహితీ ప్రయాణీకులకి వినయపూర్వకంగా విన్నవించుకుంటున్నాం.

ఓరియంట్ లాఙ్మన్

# ముందు మాట

కృష్ణశాస్త్రిగారు గుర్తుకు వచ్చినప్పు డల్లా ఆయనే ఎక్కడో ఎప్పుడో ప్రస్తావించిన దృశ్యం నా మనస్సులో బొమ్మ కడుతుంది. కవిత్వం రాయటం ప్రారంభించిన తొలిరోజుల్లో, అంటే డెభ్బై ఏళ్ల క్రితం, ఒక అర్ధరాత్రి సామర్లకోట ప్లాట్ ఫాం మీద ఈయనా, నండూరి సుబ్బారావు తారసపడ్డారట. నువ్వేం రాస్తున్నావు? అంటే, నువ్వేం రాస్తున్నావు? అని కుశల ప్రశ్నలు వేసుకుని, ఒకరి గేయా లొకరికి వినిపించి, సుబ్బారావు రైలు ముందు రాగా, ఆయన్ని రైలెక్కించి, తన రైలు కోసం ప్రతీక్షిస్తూ దీపస్తంభపు క్రీనీడలో పిట్టలాగా ముడుచుకు కూచున్నానని రాశారు శాస్త్రిగారు. ఒంటరితనంతో బరువెక్కిన ఈ చిత్రం ఆనాటి కృష్ణశాస్త్రికి ప్రతీకగా నాకు తోస్తుంది.

ప్రతి మనిషీ తన అస్తిత్వ కేంద్రంలో ఒక మహాశూన్యంతో పుడతాడు. ఆ శూన్యాన్ని బహిఃప్రపంచంతో, ప్రాపంచిక సౌందర్యంతో, తత్ఫలితమైన ఆనందంతో నింపగలిగే శక్తి, సాధనా బహుకొద్దిమంది సృజనకారులకు ఉంటుంది. మానవ జన్మకు శాపమైన ఆ శూన్యాన్ని కృష్ణశాస్త్రిగారు అద్భుత, సౌందర్యమయ ప్రపంచంతో నింపారు. ఆత్మస్వేచ్ఛకీ, సృజన శక్తికీ ప్రతీక అయిన ఊర్వశిని ఆ శూన్యంలో నిలిపారు.

ఈ తపస్సూ, అన్వేషణా ఒకనాటివి కావు. 'కృష్ణపక్షం'లో ప్రకృతితో తాదాత్మ్యంతో మొదలై, ఆత్మకీ, స్వేచ్ఛకీ, అద్వైతాన్ని తెలుసుకుని, సౌందర్యాన్వేషణలో పండి, ప్రేమకై తపించి, విరహాగ్నిలో కాగి, లోకం చేత నిరసింపబడి, ఆత్మదైన్యంతో

క్రుంగి; తరవాతి కావ్యమైన 'ప్రవాసం'లో అన్వేషణ తీవ్రతరం కాగా, దుఃఖంతో నిర్వేదంతో ఐక్యం చెంది, చివరికి 'ఊర్వశి' కావ్యంలో స్వేచ్ఛకీ, సౌందర్యానికీ, ప్రేమకీ, కవి సృజన శక్తికీ సంశ్లేష మూర్తియైన ఊర్వశిని సాక్షాత్కరింప చేసుకున్నారు. తనలోని మౌలిక శూన్యాన్నించి కృష్ణశాస్త్రి సాగించిన ఈ అన్వేషణ, దుఃఖమూ, నిర్వేదమూ సాధనాలుగా, చివరికి ఊర్వశీ మూర్తిని అందుకుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వం రెండు ప్రవాహాల సంగమం. ఒకటి భాషకి సంబంధించింది. రెండోది ఆలోచనకీ, వ్యక్తిత్వానికీ సంబంధించింది. తెలుగు భాషా, దాని నుడికారపు సొంపులూ తరతరాలుగా ఆయన వంశీయుల రక్తంలో జీర్ణమై పోయాయి. నాలుగు వందల యేళ్ల నించి వారి పూర్వీకులు పిఠాపుర సంస్థాన కవులూ, పోషితులూనూ. వారి నాన్నగారు తమ్మన్న శాస్త్రిగారూ, పెదనాన్నగారు సుబ్బరాయ శాస్త్రిగారూ గొప్ప పండితులూ, కవులూ. వారి వద్ద స్వయంగా భారత, భాగవతాదులూ, ప్రబంధాలూ చదువుకున్నారీయన. శాస్త్రిగారికి ఇష్టతముడైన కవి నన్నయ్యభట్టు. తరవాత తిక్కన. ఆ తరవాత రామకృష్ణుడు. శబ్దప్రయోగం, కవిత్వ శైలుల విషయంలో ఈయన నన్నయ నించి నేర్చుకున్నది చాలా ఎక్కువ. "శబ్దానికి ప్రాణమే కాదు, పక్షాలూ ఉన్నాయి. ఒక శబ్దాన్నీ మరొక శబ్దాన్నీ ఒక ధోరణిలో కలిపి, ఒక విలక్షణమైన గానం పుట్టించి, దాని రెక్కల మీద కూర్చోబెట్టి, ఎట్టి దూరానుభవాలనైనా అందజేసి, ఎట్టి దూరలోకాలనైనా కనపరచి విహరింపజేస్తూ ఇంకా వెనకాల నున్నవేవో స్ఫురింపజేసే శక్తి ఒకటి ఉంది. అది నన్నయది. శబ్దం పలకడమే కాదు పాడుతుంది," అంటారీయన.

శబ్దం చేత పాడింప జేసే నైపుణ్యం ఈయన నన్నయ దగ్గిరే నేర్చుకున్నారు. శాస్త్రిగారికి పాటంటే మోజు. మాటకు లేని శక్తి పాట కుందని ఈయన నమ్మకం. ఈయనంటారు: "పాటకు ఒక శక్తి ఉంది. మాటల కందని వాటిని చెప్తుంది. ఏ అనుభవమైనా, తన్మయత్వం దాకా తీసుకుని పోయేటప్పటికి మనం దానిని వ్యక్తపరచడానికి సంగీతాన్నో, దాని ఆభాసాన్నో సాయంగా తీసుకుంటాము.. ఇక మహాకవికి మామూలు దృశ్యాలను మించినవి సాక్షాత్కరిస్తాయి గదా! మామూలు ఆవేశాలని మించినవి ఊగిస్తాయి గదా! వాటిని ప్రకటించడానికి సామాన్య శబ్దాలూ, ఎక్కడెక్కడి మాటలూ ఏరి తెచ్చి వాటిని రకరకాల కూర్పుల్లో పెట్టి, చిత్రచిత్రాలుగా నడిపించి, ఒక వింత గానం పుట్టించి, తనకు సాక్షాత్కరించిన దాన్ని మనకు కూడా ప్రత్యక్షం చేయడానికి ఆయన ప్రయత్నిస్తాడు. ఈ శక్తి నన్నయకున్నట్లు ఆంధ్రకవులలో ఎవరికీ లేదు."

కృష్ణశాస్త్రిగారి కవితాశైలి మీదా, పద్యం, పాటా నడిపించే ఒడుపు మీదా నన్నయ ప్రభావం మిక్కుటంగా ఉన్నట్టు తోస్తుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వంలోని రెండో వాహిని ఇంగ్లీష్ విద్యా సంస్కారం. ముఖ్యంగా బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి వద్ద అధ్యయనం చేసిన ఇంగ్లీష్ రొమాంటిక్ కవిత్వమూ, సూఫీ కవిత్వమూ, రవీంద్రుని కవితార్ణవమూ.

పద్దెనిమిదో శతాబ్దం చివర ఫ్రెంచి తాత్త్వికుడు రూసో భావాల నించి అంకురించిన రొమాంటిక్ ఉద్యమం వ్యక్తి స్వేచ్ఛని ప్రాతిపదికగా తీసుకుంది. మనిషి సహజంగా మంచివాడు, సమాజం

వల్ల చెడతాడు; సమాజం కన్నా వ్యక్తి ముఖ్యం, వ్యక్తి స్వేచ్ఛ పునాదిగా లేని సామాజిక నియమాలకు తలవంచనఖర్లేదు అని వీరంటారు. ఈ ఉద్యమం మౌలిక మానవ స్వభావంలోనే గొప్ప మార్పు తీసుకు వచ్చినట్లుంది. అంతవరకు మహత్తర మానవశక్తిగా కొలిచిన బుద్ధిని (reason) పదవీచ్యుతం చేసి, ఇంద్రియానుభూతిని (sensibility) సింహాసనం ఎక్కించారు. విశ్వాన్ని నడిపించే అదృశ్య శక్తుల్ని ఇంద్రియానుభూతి, లేదా చేతన, ద్వారానే తెలిసికోగలమని వీళ్లు ఖచ్చితంగా నమ్మారు. మానవ ప్రకృతికీ, భౌతిక ప్రకృతికీ సన్నిహితాలూ, సమాజానికి అతిరిక్తాలూ ఐన భావోద్రేకాన్నీ, వ్యక్తి చేతననీ వీళ్లు పైకెత్తారు.

వ్యక్తి స్వేచ్ఛ అంటే మనిషి తన స్వధర్మాన్ని వ్యక్తపరచ గలగటమే. ప్రేమా, ప్రకృతితో తాదాత్మ్యమూ ఈ స్వేచ్ఛ యొక్క అభివ్యక్తులే. ఆత్మస్వేచ్ఛా, ప్రేమా, తాదాత్మ్యమూ అన్నీ ఒక్కటే. వేరు వేరు కావు. తన స్వధర్మాన్ని అన్వేషించటం, దాన్ని వాస్తవీకరించు కోవటమూ, ఇవి రెండూ కృష్ణశాస్త్రిగారి కవితా ప్రస్థానంలో ముఖ్యాంశాలు. తన ఆత్మాభివ్యక్తికి ప్రతీక, ఐన ఊర్వశిని సాక్షాత్కరించుకోవటంతో కృష్ణశాస్త్రిగారికి చివరికి తపస్సిద్ధి కలిగింది.

* * *

అగ్నిపర్వతం మరిగి మరిగి, సెగలు వెళ్ళగక్కి చల్లారాక, వర్షాలు కురిసి నిర్మలాకాశాన్ని ప్రతిఫలించే సరస్సుగా మారి, అందమైన పద్మాల్ని వికసిస్తుంది. కృష్ణశాస్త్రిగారి తరవాతి రచనలైన పాటలూ, యక్షగానాలూ, రేడియో నాటికలూ అటువంటివి. ఆత్మమథనం, అన్వేషణా, సమన్వయం కోసం సంఘర్షణా, ఏవీ లేవు. భాషతో, సంగీతంతో పదాల సొగసులతో, వంపులతో అభినివేశం ఒక్కటే

మిగిలింది. తెలుగు కావ్య సంప్రదాయానిదే పై చెయ్యి. నన్నయా, తిక్కనా, రామకృష్ణుడూ దగ్గరివారయారు.

కవిత్వానికీ, సంగీతానికీ సన్నిహిత సంబంధం ఉందని శాస్త్రిగారి అభిప్రాయం. కవిత్వం సంగీత స్థాయికి ఎదగా లంటారు. సంగీతమంత భావస్ఫోరకంగా ఉండాలంటారు. "కవిత్వంలో శబ్దం పలకడమే కాదు - పాడుతుంది. వచన కావ్యానికీ, పద్యకావ్యానికీ ఉన్న తేడా గమన తీవ్రతే అంటాడు - మిడిల్ టన్ మర్రే. ఈ గమన తీవ్రత సాధించ డానికే పద్య నిర్మాణంలో శబ్దాలను మరీ సార్థకంగా ఏరడం, మరీ బిగువుగా చేర్చడం, వింత వింత ఛందస్సులలో కూర్చడమున్నూ. భావ గీతం వంటి పద్యకావ్యం దగ్గిరికి వెళ్లేటప్పటికి శబ్దం పాటే అయిపోతుంది. 'కవిత్వం శబ్దరూపంలో ఉన్న గానం' అని దీనినే అన్నాడు కార్ లైల్."

ఇంకా ఇలా అంటారు: "మంచి పాటలు వ్రాసేవాడికి, నిజమైన పాట వ్రాసేవాడికి లోపల కూడా అంతరంతరాల్లో సంగీతం వచ్చి ఉండాలి. ఏ అనుభూతికి ఏ రాగమో, ఏ వరసో ఏ విరుపో, ఎక్కడ ఏ నొక్కో, ఏ ఒదుగో, సరిగా మాటా అవీ కలిసి వస్తాయి. నే ననుకుంటాను,గేయానికి ఎక్కువ నగలు తొడగకూడదని - శబ్దార్థాలంకారాలూ అవీ! వాటి బరువు పాటని ఎగరనివ్వదు. లోతులకు రివ్వుమని దిగనివ్వదు."

ఎన్ని రకాల పాటలు రాశారో శాస్త్రిగారు. తెలుగు ప్రపంచ మంతా, తన పొలాలతో, గట్లతో, కాలవలతో, పాటక జనంతో, పిల్లలతో, స్త్రీలతో, వాళ్ల ఆనందాలతో, ఆశలతో, దుఃఖాలతో వాటిల్లో ప్రతిఫలిస్తుంది. తెలుగు ఇళ్లల్లో, వీధుల్లో, పెళ్లిపందిళ్లల్లో, చేలల్లో, తోటల్లో, కాలవగట్ల మీదా యుగయుగాలుగా నిగ్గు తేరిన

పదాల, జావళీల నుడికారపు అందం, మలపుల సొగసూ, విరుపుల ఒయ్యారమూ ఆయన పాటల నిండా విరిసి మనల్ని అలరిస్తాయి. క్షేత్రయ్య తరవాత ఇంతటి గేయకారుడు రాలేదని నా అభిప్రాయం.

* * *

కృష్ణశాస్త్రిగారి పద్యం కన్నా గద్యమే గొప్పగా ఉంటుందని పద్మరాజుగారు అంటుండేవారు. చాలా మంది గొప్ప కవుల గురించి ఇటువంటి రిమార్కులు వింటుంటాం. నిజానికి, కవైన వాడికి గద్యం, పద్యం రెండూ ఒకటే.

శాస్త్రిగారి గద్యరచనలు చాలా మట్టుకు రేడియో కోసం రాసినవి. వీటి వైవిధ్యానికి అంతు లేదు. సాహిత్య విమర్శ మొదలు బామ్మగారి ముచ్చట్ల వరకు అన్ని జీవిత కోణాల్ని స్పృశిస్తాయి.

ఎందుకంటే, కృష్ణశాస్త్రిగారి గుండెల్లో అందరికీ, అన్నిటికీ చోటుంది. నేను మానవతా వాదిని, వట్టి హృదయవాదిని అని తరచూ అంటుండేవారు. ఇది ముమ్మాటికీ నిజం. ఆయనలా అరమరికలు లేకండా జనాన్ని ప్రేమించిన వాళ్లని నేను చూడలేదు. ఎల్లప్పుడూ ఆయన చుట్టూ జనం ఉండవలసిందే, ఆయన కబుర్లు చెబుతుండాల్సిందే. గొంతుక ఆపరేషనై, స్వరపేటిక తీసేశాక కూడా ఆయన నోట్ బుక్కుల ద్వారా సంభాషణ సాగించేవారు. ఇటువంటి నోట్ బుక్కులు కొన్ని వందలో వేలో పోగయాయి.

ఇంత కరుణార్ద్ర హృదయం ఏ వరం వల్ల సిద్ధిస్తుంది? అని ఆశ్చర్యపడుతుంటాను అప్పుడప్పుడు. ఆయనే అంటాడు: "బాధ వరం. బాధకి చాలా శక్తులున్నాయి. బాధలో కాలిపోయేవాడు పాషాణం కాలేడు... బాధ దృష్టిని నిశితంగా చేస్తుంది. దయార్ద్రంగానూ చేస్తుంది. వేదనలో వేగిపోయేవాడు బాహ్యవిశ్వంలోకీ, మానవ

ప్రకృతిలోకీ చొచ్చుకొని పోయి లోపల లోపల పెల్లగించిచూస్తాడు.. అప్పుడొక విధమైన అనుకంప కలుగుతుంది; ఒక విశ్వజనీన బాంధవ్యం ఏర్పడుతుంది... వేదన వల్ల గాని ప్రేమ కలగదు. ఈ రెండూ కలిస్తే కరుణ అవుతుంది. ఈ రెండూ కల హృదయం సదా స్నిగ్ధం."

"అలాగే కావ్య కల్పనలో కూడా. ఏ కావ్య సృష్టికయినా ఈ కరుణే కారణం.. కనుక, ఈ విశ్వ ప్రేమ - ఈ కరుణ కావ్య నిర్మాణానికి కారణమౌతుంది. అంతే కాదు.ఈ విశ్వప్రేమను, కరుణను ఇతరుల హృదయాలలో కలిగించడమే కావ్యానికి ముఖ్యోద్దేశమని కూడా తత్త్వవేత్తలంటారు."

"నిందించడానికీ, కీర్తించడానికీ కాదు. మానవుని మానవునిగా చేయడానికే కావ్య నిర్మాణం.

" ఈ అనుకంప ఎంత లోపల ఉంటే అంత మానవత్వం మానవుల్లో ఉన్నదన్నమాట. దానిని ఎంత ప్రభవింప చేస్తే అంత గొప్పదన్నమాట ఆ కావ్యం!"

"అటువంటి కావ్యాలు చదివి ఆ విశ్వప్రేమ తాత్కాలికంగా అనుభవిస్తున్నప్పు డయినా, ఆ దయా విధానంలో అందరూ అత్యవసరమేనని గ్రహించుకుంటాం. దాని వల్ల లోకంలో ద్వేషం కరిగిపోతూ ఉంటుంది."

ఇదీ కృష్ణశాస్త్రిగారి కవిత్వ తత్త్వం.

'కృష్ణశాస్త్రి బాధ - ప్రపంచం బాధ; ప్రపంచపు బాధ శ్రీ శ్రీ బాధ' అన్న చలం మాట అర్ధసత్యం మాత్రమే!

కాకినాడ ఇస్మాయిల్

30.10.93.

# అనుక్రమం

## నగలన్నీ విడిచిరా

**న**గ లన్నీ విడిచిరా,
వగలమారి నా కవితా!
నవరసవాహిని, గీతా
నాగర మోహిని! రావా?
కనక మేఖలాధ్వనులను,
కంకణ మణి కింకిణులను-
నగలన్నీ విడిచిరా,
వగలమారి నా కవితా!

# ఏటి కంత మౌనము?

ఏటి కంత మౌనము, కవి!
పాటకు పాటకు నడుమ?

ఊరకేల ఆకాశము
తారకు తారకు నడుమ?

# కదులు నెవో

కదలు నెవో మరల, నా
ఎదలో ఒత్తిరి గీతులు!
నిదురించే గూటు, పులుగు
విద్రిచే రెక్కల వోల!

# పావురాయి పడవా!

**ప**చ్చని నీ ఒడ్డెక్కడ?
వెచ్చని నీ గూడెక్కడ?
పరచు రెక్క తెరచాపల
పావురాయి పడవా!

# బాటసారి

ఏటికి నే బిడ్డను,
తోటకు తోబుట్టువును;
పాట నాకు కూడు,
పక్షి నాకు సైదోడు-
నా పేరు బికారి, మ
రో పేరు బాటసారి-
మన సున్న చోట మజిలీ,
మరి కాదంటే బదిలీ!

# గూడు వద్దు

నాకు గూడు వద్దు,
నాకు వీడు వద్దు-
అంతులేని తెరు వుంది,
ఆకాశం ఉంది-
వారి పక్క ధూళిలో,
అంతులేని తెరువు పక్క
ఆకుల పరు వుంటుంది!

# హీరా నందానీ!

మాట తీసుకుని నాకు
మౌనం ఇచ్చావు-
హీరానందానీ!

మౌనం తీసుకుని నీకు
గానం ఇస్తున్నా!
హీరా నందానీ!

— బొంబాయి ఆస్పత్రిలో

# ఇక బదులు చెప్పలేను

నా మందిర గవాక్షంలోనుంచి
తొలి అరుణ స్వర్ణకాంతి వచ్చి
నా రెప్పలను తాకి నప్పుడు
కళ్ళు విప్పి స్వాగతం చెప్తాను;
వేకువగాలి మునివేళ్ళతో
నా మొగం నిమిరి నప్పుడు
చిరునవ్వు నవ్వుతాను;
పెరటిలోనుంచి కొత్తగా విరిసిన
విభాత సుమ పరిమళం వచ్చి
పలకరిస్తే 'ఔ'నని తల ఊపుతాను.
కాని... గవాక్షంలోనికి, రవ్వంత ఒరిగిన
మావి కొమ్మ చివర నిలిచి
'కో' అన్న వనప్రియారవానికి
బదులు మాత్రం చెప్పలేను,
ఇక - బదులు మాత్రం చెప్పలేను.

— బొంబాయి ఆస్పత్రిలో

# హీరా నందానీ!

మాట తీసుకుని నాకు
మౌనం ఇచ్చావు-
హీరానందానీ!

మౌనం తీసుకుని నీకు
గానం ఇస్తున్నా!
హీరా నందానీ!

— బొంబాయి ఆస్పత్రిలో

# సుందర లోకం

చుక్కల కావలి దిక్కున
సుందరలోకం!
మిక్కిలి దూరం, ప్రయాణ
మెంతైనా భారం-
అక్కడ నా చిట్టి తల్లి
హాయిగానే ఉంటుంది-
ఒక్కత్తే వాళ్ల మామ్మ
ఒడిలో కూర్చుంటుంది-
అక్కడ ఇంద్రధనుస్సులు
అల్లిన పందిళ్లు
అక్కడ వెన్నెల కలాపి
చల్లిన వాకిళ్లు ....

# పిలవాలా?

వినబడదా నా కేక?
కనికరమే లేదు గాక!
పిలవాలా, నాలోనే
కొలువై యుండేవాని?

## బెంగ

ఆ కొండ బెంగలా గుంది,
అది గడ్డ కట్టుకు పోయిన దుఃఖం-
చెక్కిట కన్నీళ్ల చాళ్లు లేక,
ఆశల వంటి ఆకుపచ్చని చెట్లు,
అల్లుకు పోయే కోరికల తీగలు
ఒంటిమీద లేక-

# మసలకు ..... మానకు

మసలకు అలయకు బెదరకు
మానకు మన్వేషణము
విసిగి విసిగి కన్నులలో
వేడి ఆర్పుకోకు
బ్రదుకె మహాప్రస్థానము
బ్రదుకే గమ్యస్థానము
పద పదాన హృదయధనము
పంచిపెట్టి కదలుము

# నీ కన్నులు

గవాక్షాలు హృదయానకు నీ కన్నులు
అవే తెలుపు నీలోపలి తలపు తెన్నులు
అవి చీకటి తునుకలు
అవి నీడల మొలకలు
ని న్నెరిగిన పులుగున కవి నీలి నీలి మిన్నులు
కాక యున్న మొలుచు టేల నాకు రెక్కలు
ఆ కన్నుల నిలుచు టేల ఆకాశపు చుక్కలు

# పరిమళ సందేశం

మరకత ఖచిత కనక పీఠికపై
మహా మహీ మండలేశ్వరుడు
చీనా సమ్రాట్టు
మంతనాలయంలో ఆసీను డయాడు
మంత్రులతో మాండరీనులతో.

జ్ఞాన వృద్ధులూ కృత బుద్ధులూ దీర్ఘముఖులై
చర్చించ సాగారు సామ్రాజ్య విషయాలు;
అయితే -
వివృత గవాక్షంలో నుంచి వెడలి పోయింది
చక్రవర్తి మనస్సు ఎప్పుడో!

అక్కడ - పరిచారికల నడుమ కూర్చుని
మనోహర కాచమంటపంలో
మహారాజ్ఞి,
మసృణ పర్ణాల నడుమ
మందారం మాదిరి!

"సచివాలయం నుంచి ఇంక నైనా
స్వామి రాగూడదో" అనుకుంటూ
అలవోకగా కదుపు తుంది, కేలనున్న
జిలుగు చామరం !

ఒక సురభిళానిల నిశ్వాసం
ఉర్వీపతి చెక్కిటిని నిమురుతుంది!

"ఆఁ - నాప్రేయసి పెదవుల నుంచి వచ్చింది
ఈ పరిమళ సందేశం" అని
నడచిపోతాడు మహామహీ మండలేశ్వరుడు
మహారాజ్ఞి కాచమంటంవైపు-

మంత్రులూ మాండరీనులూ
మంతనాలయంలో
ఒకరి వైపు ఒకరు చూస్తూ
కూర్చుంటారు మౌనంగా!

— ఒక చీనా కవితకు తెనుగు

# నా కన్న ముందే

**నా** కన్న ముందే వాకిట్లో
నా మనసు,
నీ కోసం నిలిచుంది చీకట్లో!

# కృష్ణ రజని

రేయి పడినది, సకియ, యేమే యళింద
మందు దీపమ్ము పెట్టవు మందిరాన?
మూసెనే కారునీడలు మూల మూల
లూరకే కృష్ణరజని నిట్టూరుపు లటు....

# బడలినాను

**బ**డలి నాను నడచి నడచి
ఎడతెగనిది కృష్ణరజని
ఒడిలో నిడుకోవా, నా
ఒడలు నిమురవా? జననీ!
వన్నె వన్నె పెనుధూళి
చిన్నెలంటె, బ్రతు కంతా-
కన్న తల్లి! కడగవ, నీ
కరుణామృతధారలతో?

# శృంగార నాయికలు

ఇరులలో తారక లివియంచు, తానెనా
కురులలో మల్లియ విరులు తురుము!
అసలె కెందమ్ము లీ అడుగు లనుచు, ఎంతొ
పొందుగా లత్తుక పూయు తానె!
అదియేదొ అంటె నీ అధరాన నని, తన
మెత్తని పెదవుల నొత్తి తుడుచు!
చూచుచు, మరి మరి చూచి మెచ్చుచు, మక
రికల చెక్కిళ్ల చిత్రించుతానె!
ఎంత పున్నెమ్ము చేసినానే, మగండు
ఒక్క క్రీగంటి చూపులో, ఒక్క లేత
నగవులో, నా మనస్సు నెరిగి గ్రహించి,
తీర్చునే యంచు మురియు 'స్వాధీన పతిక'

విభుని దోతేర పంపిన ప్రియదూతిక
లెంతకు తిరిగిరారేమొ కాని-
ఘనుల సద్గోష్ఠిలో మునిగి యున్నాడని
వెరతురేమో స్వామి దరియుటకును;
నిప్పుల వర్షమై నిలువెల్ల దహియించు
నిలబడనీదు వెన్నెలల వాన;
అయ్యయో, మదనదేవా! మ్రొక్కు దాన, నా
పైననా ననతూపు పదను బాకు?

అతనుడవు, నీవు పోగల వటుకు, — వారి
ఉల్లమున జేరి నా మాట నూదగలవు;
చనుము - నా ప్రాణముల నిల్పు మని నెలంత
తల్లడిలు విరహోత్కంఠిత వలవంత?

పవళింపు గదిలోన, పగడంపు కోళ్ల చ
ప్పరపు మంచముపైన పాన్పు పైన
వలిపంపు జిలుగు దుప్పటివేసి, కస్తూరి
జవ్వాది కలిపిన గంధసార,
మగరువత్తులు, మేలి అత్తరుల్, పచ్చక
ప్పరపు వీడియము పళ్లెరమున నిడి
ద్వారాన తోరణాల్ కూరిచి, ముంగిట
వన్నెవన్నెల రంగవల్లు లుంచి
తానమాడి, పుష్పాళ్ల నెమ్మేన నలది
నెరుల సిగ నల్లి, నుదుట చెందిరపు బొట్టు,
కనుల కాటుక, అలతి నగవులు మెరయ
విభుని కొరకు వాసకసజ్జ వేచియుండు.

ఈ తీవ యోవరియే గదా తాముర
మ్మన్నయేకాంత గృహమ్ము! తాము
మెత్తురనే గదా, మెలత, ఈ కయిసేత!
ఈ నిరీక్షణము లింకెంతసేపె?

కడచెనే రేయిసగ; మ్మైన శ్రీవారి
అడుగుల సడియును పడదు చెవుల-
మరిమరి పొగడకే మాయల మారిని,
విసిగిన ప్రాణాలు వేపి తినకె!
పదవె, అడుసాయె నేల నా బాష్పవారి
ననుచు నెవ్వగ మెయినగ లన్ని ఊడ్చు;
"అసలు దోషము నాదే" నటంచు ఏడ్చు,
విరహమున వేగిపోయిన విప్రలబ్ధ.

"మన సార వలచి వచ్చినవాడు, నీ రేడు
తొగరేని మించు సోయగము వాడు;
లాలించినాడు, తన్నేలు కొమ్మన్నాడు-
చప్పగా వాయైన విప్పవపుడు.
అవియేటి అలకలో! ఆ మూతి ముదుపులు,
ఆ మొండిపట్టులు, ఆ బిగువులు!
ఇక నిప్పుడోయమ్మ! ఎన్ని నిట్టూర్పులు
అసురుస్సు రనుటలు, అలమటలును!
ఓసి, ఇవియేటి చేతలే బైసి మాలి!
ఏరు విన్నను నవ్వగలారు లె" మ్మ
టంచు చెలి పల్క, తెలివొంది అలవి కాని
వెతల పా లౌచు కలహాంతరిత తపించు.

విన్నవే యిన్నాళ్లు, కన్ను లారగ చూసి
        నాను, నే డెంతో ఆనంద మాయె;
ఆ చందనాంకము లా తమ్ములపు ముద్రి
        కే లేమవో చెప్పలేరు తామె;
వేయికి పైనాయె ప్రియురాండ్రు, రేయికో
        మూడె యామము లాయె - మోహయాత్ర
నేదొ ఈ దారి నూరేగు చుబుసుపోక
        వేంచేసినార శ్రీ వేగుబోక;
వలదు విడియగ నిట మానవతులె గాని
వలపు బిచ్చ మాశించెడు వారులేరు;
పిలుచుచున్నవి వేరె కౌగిళులు, వెడలు
మనుచు తెగనాడు ఖండితయైన రాధ.

"అటు చూడ వీటి ముంగిటను మౌనమ్ముగా
        తల వాలిచి మన మందార తరువు!
పురి విప్పదు మన పెంపుడు మయూరమ్ము ది
        గులుచెంది దిక్కుదిక్కులకు చూచు!
సారెసారెకు మన శారిక పలవించు
        కలవరపడి ఏదొ పలుకబోవు!
ఏలాగు నీ మేఘవేళ ఒంటరి రేల
        ప్రాణేశ్వరు ప్రవాసి బాసి" యనుచు
చల్లుకొను మేన చలువ గొజ్జంగి నీరు;

గుప్పఁకొను కప్పురము తోడి పుష్పాదులను;
పొరలు సెజ్జ, లేచి మరల నొరుగు సుంత;
పొగులు ప్రోషిత భర్తృక మగని కొరకు.

నడిరేయి, కాని పున్నమినాటి వెన్నెల
పాల వెన్నెల జడివాన లీల!
హృదయేశు డున్న ఆ పొదరింటి వఁ కొరల్
పసిగట్టకుండ పోవలయుగాదె!
తెలికోక, తెలిరైక, తెలిమేలి ముసుగులో
మెయి సోయగపు మిసమిసలు దాచి,
కాలి యందెల కడియాల గాజుల ఘువల్
రవళింపకుండ చెరగున జొనిపి
మోముపై, కేలిపై గంద వొడి నలంది
పులుగు రవ్వంత గూట కదల బెదరుచు
ఆకుసడి కదరుచు, గాలి అడుగు లిడుచు,
వెడలె నభిసారికగ ప్రియు కడకు రాధ.

# ఓ ప్రభూ! కాళిదాస!

ఓప్రభూ! కాళిదాస!
రసిక హృదయ భవన వాస!
సరస కళా సరసిజరవి!
పరమ శివాస్థాన కవీ!
వందన మయు! నీ సుందర
వాణికి, రసధునికి!
కేలుమోడ్పు! నీ నిర్జర
కీర్తికి, మధుమూర్తికి!
దవుదవ్వుల నిలిచి చూతు
దరిసెన మీవా దేవా!
తొలుత నీవు ప్రేయసితో
కొలు వుంటివి ఆ వాడల-
ఉజ్జయినీపుర పరిసర
సుమోద్యాన సుందర వని!
నవయౌవన మణి పీఠిని,
నవనవ మధురస మొసగే
ఆరు రుతువులూ నీ పరి
చారికలై ఎదుట నిలువ!
అంత ధనపతి క్రోధ,
మంత విశ్లేషము;
అవల విరహ విపంచి

అనుపు సందేశము-
అటు ఝరీ గిరి పురీ
వనులపై మేఘమై
అంత రాత్రిభర మం
దాక్రాంత ఛందమై!

సుకుమారి మాళవిక
సుందర పద మంటు,
ఒకనా డశోకాన
ఒళ్లెల్ల విరు లంటు!
ఒయ్యారి సురనారి
ఉర్వికి దిగజారి,
ఒక పరి కోపించి
ఒకపరి లత అయ్యె!
బెదరిన మునికన్య
ప్రేమికుడౌ రాజు
కొదమ తుమ్మెద వోలె తామర చామర!!

— "కాళిదాసు తన నాయికలతో" అన్న రూపకం నుంచి : 24-10-1957

# మేఘ స్వామీ!

అటు మా వీడు!
ఇటూ అటూ గోడలపై శంఖం పద్మం-
ఎత్తుగా ఇంద్రధనుసు వంటి వీధి గుమ్మం-
ఆగి కాస్త ఆనవాళ్లు ఆలకించి పొమ్మి,
ఆగవేమి? నవాషాఢ మేఘస్వామీ!
ఉన్నది గద అలకానగరం-
కిన్నర పతి మందిరం
ఉన్నదా! దాని కవల ఉత్తరాన చూడు-
అది మా వీడు-
దాని చెంత తాల మందార మొకటికనబడు-
ఎన్నో పూలూ అదీ,
కన్నబిడ్డ వంటిదీ!
మరి పక్కను దిగుడు బావి-
మరకత సోపానాలు-
కనక కమల పాళి - కలహంసాళి!
కెలన నున్న ఇంద్రనీల క్రీడాశైలం
తల పయి ఒక మాధవీ లతా మంటపం-
నలుగడలా గోరింటల దడి-
    అక్కడ నిలబడి
చలదళముల అశోకం-చక్కని వకుళం!.....

# మరల విజయనగరం

ఎటు చూచినా, ఎటు వెదకినా
ఏ చోటా కనబడవూ! నే నెరిగిన అడుగుల గురుతులు-

ఒకనాడు ఒరిగిన ఆ గూడు
ఒకనాడు పెరిగిన ఆ వీడు
నే తిరిగిన జాడలు, నే నిలిచిన నీడలు
అవేనా, అవేనా?

ఆ బాల రసాల శాఖా శిఖల అరుణ కిసలయము లేవీ?
ఆ యౌవన నందన సుమకుంజాళిందమున
మిళిందము లేవీ?
ఏవీ, నా కోయిలలు? ఏవీ నా ఊయెలలు?
ఇకనే చూడను కాబోలు!
ఇవి ముసలి చీకు కనులు-

ఒకరు చిరునవ్వినా, ఒకరు దయగనిన
ఒక రాకరే నను కౌగిలించిన
ఇక ఈ ఊరు వదలను
మరల మన విజయనగరం!-
అమృత వసంతారామం,
అక్షయానందధామం!

# మహతి

వివృత చైత్ర విభాత భవన నిస్సరణమున
వేమారు మ్రోత లిడు నేడు
దివిజగంగా భంగ సంగీతరుతి శ్రుతిగ
దేవరుషిచేతి మహతి
స్వేచ్ఛా నిరతి
దివ్యాని లాంగుళీ నిహతి!
వికచ శతతంత్రీ విశాలగళ పదవీ
విగళితములై పొరలగా
గంగా ప్రభాళులో, యమునా మధూళులో,
క్షీరాబ్ధి కౌముదీపాళులో
దివిజగంగా......
యుగయుగాంతర పథాంచల దూరవేలా త
లమ్మంటి పరతెంచగా
నిగ మామృతమ్ములో, నిభృత సందేశములో,
నిశాంత నిబిరీస స్వప్నమ్ములో
దివిజగంగా......
సాంద్ర చిరనిద్రా విముద్రి తాఖిల భార
తావని పులకరింపగా,
విహగ కలకలములో, విరుల పరిమళములో,
విశ్వమంగళ తూర్య కోలాహలమ్ములో
దివిజగంగా......

# స్వర్గసీమ

ఎచట నా మస్తకమ్మెగయు హిమశృంగమై
ఎచట జ్ఞానమ్మందు నెల్లరకు ముక్తమై,
నిర్భీతి మన సెచట నిశిత హేతిగ మెరయు,
లోకమెట విడ దిరుకు చీకుగోడల చిదికి,
వాక్కు లెచ్చోట వెల్వడును నిశ్చల సత్య
గర్భమ్ము నుండి నిర్భర జీవనదులుగా,
ఎచ్చోట తీవ్ర వే గోచ్ఛలిత దుర్వార
కర్మధారలు నిండుకడలి లోపల పండు,
స్వచ్ఛందమై స్వచ్ఛ సరళమై ఎచట వి
జ్ఞాన మింకదు జడాచార సికతా సీమ,
ఎచట మన సెపుడు పరువెత్తు క్రొంగ్రొత్త భా
వాధ్వముల కందరము లందు జాగృతి నించి,
అచ్చోట ఆ స్వర్గమందు మేల్కొలుపవా
ఈ పురాణ ధరిత్రి నీ భారత సవిత్రి,
నీ దయా దృఢహస్త నిర్దయా ఘాతమున!

*రవీంద్రుని గీతానికి అనువాదం : కృష్ణాపత్రిక, సెప్టెంబరు* ***1948***

# మహోదయం

ఏమహాత్మ్కు చేయి ఈ రేయి చెరసాల
తలుపు లూడలాగె తెలియకుండ!
పొరలి ముంచు కొత్త పొద్దు గాలులతోడ
చనవులేక యూర్పు సాగదేమొ!

అవురా, సఖుండ, నమ్మవు కాని చిరనిద్ర
మాని యొత్తిలి చూడుమా, త్వదీయ
గేహాజిరమున క్రిక్కిరిసెను వెల్గులు
రేయి యంచుల పొర్లి పోయినట్లు-
ఏనాటి కేనాటి కిది మహోదయము! త
ప్పదు చల చ్చక్ర చాపమ్ము వోలె
మువ్వన్నియ పతాక మూగాడు! కొత్తరా
చరికపు బిగువుతో చదలు నింపె-
లెమ్ము నెచ్చెలి కాడ, నిజమ్ము లేచి,
కనుమ నీ వొక్కపరి, నాల్గు కడల పొడిచి
తరలి పైబడు ముక్త చైతన్య ధార!
ఎత్తు తల పైకి హిమగిరి శృంగ మట్లు!

కొన్ని నూరేండ్లు బానిసీడన్న మాట
గుండె లోలోన దొలిచిన కుమిలి యేడ్తు
మిప్పటికి గూడ, కేలైన నెత్తకుండ-
ఎట్టు లుంటిమొ, చిరుజాతు లెగసి పడగ?-

గదుల్త్రై, అరల్త్రై చెడినది కలకాలపు మన లోగిలి
కదిసిన ప్రతీచి ప్రాచియు కరిగిపోయె నొక కౌగిలి!
సరిహద్దులు చెరుపగలుగు కరుణ జగత్కుటుంబమున
పరపీడన ముండనీదు; పచ్చినెత్రు తాగనీదు!

జరఠ శిథిల జగత్ మందిరములను పడగొట్టు!
తరుణ మంగళ స్వర్గము ధాత్రీతలమున గట్టు!
భావికాల ముఖశాలల బ్రతుకులు పరపించి
ప్రతిమానవు శిరమున నుజ్జ్వల మకుటము పెట్టు!

— అభ్యుదయ సెప్టెంబరు *1947*

# జయజయ!

భారత రాష్ట్రపతి! జయజయ!
మేరు ధృతీ, సుకృతీ, మహామతీ, ॥భారత॥
విశద సదాశయ వీథీ పథికా,
సత్యాహింసా సంగర రథికా! ॥భారత॥
చిరతర భారత దివ్యతపఃఫల,
గాంధిదేవ శుభధర్మా చంచల,
శాంతహృదయ, సదయాంతఃకరణా!
సత తారాధిత భారతీ చరణా!!

*ఢిల్లీ రాష్ట్రపతి భవనంలో రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ సమక్షంలో*
*పాడబడిన పాట : 31-12-1953*

# బదరిక

మలు సందెల తెలి తలిమ
మ్ముల నలయికవో శరీరముల వాలిచి తా
తల నాటి కతలు మా క్ష్మా
తలనేతల కతలు వినుచు, తలపున, తంద్రుల్.

ప్రతి దివసాంత విశ్రాంత శరీరముల్
నను సెజ్జ వాల్చి యనుంగు పితలు;
నడుమ లోలోపల విడుస్వప్నముల తోడ
దరవికస్వర లతాంతమ్ము నేను;
మునిమాపు నిశ్శబ్దమున నిండుకొను వారి
మందర గంభీర మధుర రవము;
అలరుతేనియల పాటల తేట ముయ్యేట
మునిగి చలించు నా ముగుద బ్రదుకు
రక్తి తంద్రుల కంఠ విముక్త వల్ల
కీ నినాదమ్ము నింపుకొన్నాను నాడె;
నాడె మధువేళ లందె నా ననయెడంద
పుణ్య వశమున గంధర్వ భూమి యయ్యె!

మొయిలుగా నడిరేయి బయలులో కనుదోయి
రాజిగా నిలిచె సర్దారు సాది;
ఇరులలో కాటుక తెరలలో మెరపుగా
కదలి యాడెను రావుగారి కత్తి;

తునుకలై వ్రేటాడు తూలికలై రాలె
        రాహుత్తుతోడ ఫారసి హుమాయు;
నేల నారసి వీరు వాలక మ్రొక్కరసి
        పరువు కన్బొము లెత్తె ఫాదుశాహి
నేటికిని తెన్గు రావు భూనేత వాలు
నగరు మొగసాల పగడంపు నాల్క సాచి
ఒర నిముడబోని కాపు తొందరల నుండు
రేలు బవళుల ఏలిక మేలు కొరకు!

మలకకు నధికార మైరేయ పాయికి
        కన్నుదోయికి మన్ను మిన్ను లేదు;
వెలమకు నవమాన వేదనానల మేర్చ
        విసము కన్నను తన యుసురె చేదు;
తాను గోల్కొండ సుల్తాను కావున పోటు
        మాటాడగా మొగచాటు కాదు;
వాలు శ్రీరంగ భూపాలు కేలిది కాన
        ఒర వీడి యూరక తిరిగిపోదు;
కంటిసెగగ నిట్టూరుపు కారు పొగగ
కినుక రానీక షాదుషా కనుక మ్రోల
నేల నంటగ మౌళి ఖుర్నీషు జేసి
యసువుల దొలంగె పెనుకత్తి కొసల - మాని.

మాధవరాయ భూమాధవ గ్రామణి
ఘన రాజ్య భోగభాగ్యముల మాని,
అపర నారదమౌని, యరుదెంచి నాడంట
నాడు నాడుల వాడవాడ లంట
హరిచరణ విభాత తరుణారుణ ప్రభల్
బ్రతుకులో మూలమూలలకు నింపి
తెర్లు చిక్కని నల్ల తిరుకాపు తీర్పగా
నసువుల నసికొస కొసగె నంట
శ్రీ వరదరాజు వర దయాహృదయ మధువు
లుబికి కనురేకు కొనలంట నురికె నంట
పదియు నిద్ద రాళ్వారులు కదలి చెంత
రాజమౌళికి చోటిచ్చి రంట నాడు!

"నా డెన్నడో వారనారీ సుధాధర
సీధు వానిన గొంతుజీర విడిన
పొరలి వచ్చిన పద్యముల కంట ధూర్జటి
రాయలెక్కించె వజ్రాల గద్దె;
పరమార్థము వచింప పరమమాహేశ్వరుం
డౌ కవీశ్వరుడని మాకు దోచు;
నటరాజ మంజీర కటక శింజాన సం
ధ్యా శ్రీలు వాని పదాల చాలు!
రాజు కవిరాజు రసిక సమ్రాట్టు కృష్ణ
దేవదేవేంద్రు" డనుచు పృధ్వీశమౌళి

రామ రాయేశు డత్యాదరమున గృతుల
గొని పితల నుండి వారికిట్లనియెబ్రీతి

"ఇదె మా కేలిని నల్ల నందికొని రారె రండధి ష్ఠింపుడి
య్యదె మాపీఠ పురీ నరేంద్రుల సుధర్మా స్థానిలో
గద్దె; శా
రద మాంజీర రణన్నినాదము మహారాజ్యేందిరా నూపురా
భ్యుదిత స్వానము మ్రోయబోని నిముసంబున్ లేదు మా
కొల్వులో"!

మాసిన గాథ లెల్ల ముని
మాపుల మూసిన యంధకారమే
యోసరిలంగ ద్రోసెడు న
వోడు గణం బటు నూత్నజీవ వి
న్యాసము తోడ వెల్వడ వి
హారము సేసితి మేము నాడుస్వే
చ్ఛాస్పృతి బూర్వకాల సువి
శాల విహాయస వీథు లంటగాన్.

సారెకు బ్రాకు నాటి స్మృతి
జాలము లీ మది శక్ర చాపరే
ఖారమణీయ రాగముల
కైవడి.........

# లేడి

నా యనుగు చెల్లెలా, హరిణీ! యొకింత
నిలువవా యిట గన్నేరు చలువ నీడ-
ఏ సడియులేని యిచ్చోట నెడద నెడద
నదిమికొని నేడు సుంత యేడ్చెదము కాని.

ఇంత సవ్వడియేని సైరింపలేని
మనకు దొరుకదు బదరికా మధురశాంతి;
విసివినది జీవితము నీది, విసివి విసివి
రాలి పోదును నేను పెంధూళి నెపుడొ!

గాలి యడుగులు నీయవి, నీలి నీలి
నీలి జాడలు, యోగ నిద్రాళువులు కి
సాలములు గూడ, ఋష్యాశ్రమాల త్రుళ్లి
పడవు నీ వెట్టి తొందర పరువులైన.

ఏడిచి ఎన్ని నాళ్లయిన దీ యెద! అశ్రులు కన్ను మోసలం
దోడిచి ఎన్ని నాళ్లయిన దోసఖి! నీవును;
శ్రావణమెు యీ
నా దరుదెంచెనో మనకు- నా హృదయమ్మున
ఏ తలంపులో,
ఏడు పయోధులో ఎగసి ఈ గళదేహళి వెన్క మ్రోయుగా.

# కోయిలా!

కోయిలా! నీ కొరకొ పాట కొరకొ కాని
వేగు వాడలో వనములో వేనవేలు.
ఆరిపోలేని నా ప్రణయమ్ము నడుమ
గలిగె నేమందు నీ వియోగమ్ము నాకు!
ఏ సుఖస్వప్నముననో నిన్నేను కలియ
నాసపడి యాసపడి యెదు రరసి యరసి
యెగసెగసి పడి రాతిరి యెల్లరెప్ప
వాల్ప లేను నిర్నిద్ర నేత్రముల పైన
అంత నా మందు నయన సంధ్యారుణిమల
దొలి ప్రభాతంపు దెలి తెలి వెలుగు లలము
ఊరబడి పోవ కై సేత కొకరి కొకరు
సాయపడ మాకె మాపయి జాలి వొడము!

# రాజమౌళి

నీ చివురు వ్రేళ్ల పూచె నిర్నిద్ర కౌము
దీ సురభిళమ్ము లీ మల్లికా సుమాలు;
ఈ నవాబ్ద సందేశ మందీయు నూత్న
చైత్రవేళా సుఖస్వప్న చంద్రకళలు!
నా సఖీ! నా కరగ్రహణమ్ము కొరకొ
వీని ప్రేమాలసముగ జే విడిచినావు;
అపుడు మన యంతరమ్మున నడగి విరిసె
వాడు టెరుగని నందన వనపు శోభ!
వాడి పోనీను వీని; ఏ జాడకేని
ఎగిరిపోనీను తావుల; ఇపుడు నపుడు
నా ప్రణయజీవ నాశ్రుకణాలు వోసి
తొలి యుషస్సుల దివ్య నిర్మలత నుంతు!
వీని శిరసున దాల్తు దేవీ ప్రసాద
శుభ వరమ్ములు స్వర్గ దుర్లభము లంత
నీ ప్రియుడు రాజమౌళియౌ నిజము, లోన
గరళ మెంతకాలము మోచెనో యెరుగవేమొ!

# మోహినీ హాసము

అది మదిర వోలె నా కను లంట జారి
యంటికొన్నది నా హృదయమ్ము కూడ
మోహినీ హాస మది, సుధాముగ్ధ శిశిర
మది నిటలనేత్రు చూపు, కాలారుణమ్ము!

# రాగమయి

ఆ విరజా నదీ తటములం దిరవొందు లతాగృహమ్ములన్
బ్రోవులు ప్రోవులై యురలు పూవుల మాలలు గాగ
గూర్చు రా
గావిల కోమ లాంగుళులు, ఆ హరి పాద సరోజ పూజకై
ఈ వల వేల వేచు హృదయేశుడు చాచు గళమ్ము
కోసమై!

# ఉత్కంఠ

మాయని మల్లెపూవులు త
మస్విని కంఠము నంటి మాలలై
పాయవు; నీల మేఘ గళ
పాళి జలింపని కౌగిలిన్ బలా
కాయత హారముల్ పెనగు;
శ్యామ మనోహర కంఠసీమ కై
సేయగలేను తచ్చరణ
సీమనె నా కనులెల్ల మూగగా!

# కన్నె మనసు

తలపు లూరే కన్నె మనసు
వలపు లేరే కోడె వయసు
ఎంతలాగిన ఆగునా, అవి
ఎంత దాచిన దాగునా?

ఎవరు చెప్పే రామనిని సరి
కొత్త కోర్కెలు తెమ్మని-
ఎవరు కోరిరి తుమ్మెదని విరి
కొమ్మ కెదురుగ రమ్మని!

ఎవరు తప్పని మనసు లాగిన
ఎంత లాగిన ఆగునా, అవి
ఎంత దాచిన దాగునా?

తెలివి మాలిన వారు, పాపం,
తెలియ దనుకుంటారు గాని-
మనసులోపలి వేడి తలపులు
మరుగు చూపులు పట్టి ఇస్తాయ్!

కనులు మూసుకు వారు లోకం
కాన దనుకుంటారు గాని,
మవ్వపున్ మమకారములు, చిరు
నవ్వు దివ్వెలు పెట్టుకొస్తాయ్!

# నిగమశర్మ పద్యాలు

[“అది శివరాత్రి- పిఠాపురంలో, కుక్కుటేశ్వరస్వామి రథోత్సవం. ఉమరల్లీషా గారి ఇంటి అరుగు మీద ఉత్సవాన్ని చూస్తూ నిలబడ్డాడు కవి. కవిలో తండ్రుల నాటి స్మృతులు కదులుతాయి. వెంటనే కవి ఒక కావ్యంలో తానే నిగమశర్మ అవుతాడు. దానిలోని కొన్ని పద్యాలు”
-- ‘స్వీయకవిత’ రేడియో ప్రసంగం నుంచి.]

నీ నిట లోగ్ర పావక కనీనిక క్రక్కు లయాగ్ని కీల ఏ
మైనదయా గయాసుర నిరాసన తీవ్రత కోడి,
కోడి రూ
పై నిఖిలేశ్వరేశ్వరుడ వయ్యు నిశీథి విశీర్ణ కుడ్య వా
సానుచిత శ్రమన్ బడ అసత్యపు నాటక మేటికో ప్రభూ!

ఇటు దెసమారి జాలి బ్రతుకీడ్చుట కన్న ప్రసన్న
పాళి హృ
చ్చటుల రయమ్ము మనం బౌరలు స్వామి రథాంగ
పథాంగణాన హే
నిటల విలోచనా! హర! వినీల గళా! భవ!
కంకణీ కృతో
ద్భట వికటోరగా శివశివా యని ప్రాణములేల బాయనో!

దవు దవ్వు లంద కేతన కింకిణీ మణీ
నవ ఘృణీ పార మందంద నరసి
పురుగేని వరుగేని దరిసి పెంధూళిలో
నొదిగి రథమ్ము కట్టెదుట నొరగి
శివశివా యనుచు నేడ్చిన చాలు మనుచునే
గాని ఆవంత యాగ్రహము రాదు
వ్యాళమ్ము లేల? త్రిశూల మేలా? నన్ను
నేలువానికి కంటి కీల యేల?
తాను హాలాహలమ్మునంత దిగత్రావి
గృహ గళార్గళ మేల బంధింప తండ్రి?
నాకు నీకయి కురియుగాక లేత
నెల తలపు వాన చదలేటి చలువ సోన!

# వేణువు పిలుపు

వలిగాలి కేలి కౌగిలి నూగు కాళింది
కాలి యందెలు గలగలని మ్రోగు-
కెలకున రెల్లులో కొలకున దాగు బె
గ్గురుపుల్గు కను లరతెరచి జోగు-
దరిలేని విరహాన మరుగు చిగురు సెజ్జ
పొరలుచు మంకెన పూావు వేగు-
కనుచూపు మేర దాటిన తేటి వలపేర్చ
గా నవమాలతి మేను కాగు-
కడిమి తెరువులు, పొగడ మార్గములు, మొగలి
సందులు, వెదుళ్ల గొందులు సాగి, కోవి
దార సుమముల దారులు దాటి మరల
తరుణ మురళీ శర న్నిశోత్సవము సాగు!

నిద్ర మాన వెన్నెలలు, ఉన్నిద్రరాగ
రేయి నిట్టూరుచు, తమాల వృక్ష మూల
సైకత వితర్ది కోపరి శ్యామ పర్ణ
పాళి పానుపు గాగ నేర్పడె తనంత!

ఔరా! ఏమని నిద్రపో వలతు
రమ్మా గోపికల్ మీరు? బృం

దారామమ్ముగ పాలమీగడల
వానల్ జారు ఈ రేయి సు
స్మేరాస్యమ్మగు శ్యామసుందర ఘన
శ్రీ మూర్తి కాబోలు వం
శీరాగమ్ముల పిల్పులన్ వినరటే ....

అంత శిశిరమ్ము కదె సుషిరామృతమ్ము,
ఎటుల మరగించునే సఖీ! ఈ విరహము?
తనది కరిమబ్బు మేని సౌందర్యము కదె,
నిండు పున్నమి నెటుల పండించు లోన?

దరియు కొలది చాల దవ్వౌను, దవ్వైన
కొలది దరిసి దరిసి పలుకరించు;
నిముసమేని నిలువ నీయదు వేణువు-
పిలుపొగాని, మేలు కొలుపొగాని!

— 'యమునా విహారి' నాటిక నుంచి

# ఏనాటి కథలు

తానే నా కయి స్వామి వచ్చె నట బృం
దన్ వీడి గోగోప బృం
దానన్ విందుల కూడ వీడి, ప్రియరా
ధాసుందరీ రాగ గా
ఢానవ్యోత్సుకమైన వీడి; అటు కా
దా, యేల నాలోనని
ట్లౌనా, నా హృదయాన శారద శశాం
కాంశు ప్రభల్ పర్వునో!

ఏ నెరుంగుదునే సఖీ తప్పదే విను
అవి దేవదేవుని అడుగు సడులె!
ఊరకే ఈలాగు కోరగించునె చూడు
మేను మేన కడిమి ప్రాను వోలె!
ఇటునటు తూగాడు నే యెడ శ్యామసుం
దరుమెడ పొగడ పూసరము కరణి!
ఏలాగు రాగమ్ము లెగయునో యమున హృ
దయమున తరగదొంతరల పగిది!
అఖిల హరిదంతరాళమ్ము నందు నిండి
స్వాంత మందు శరద్వి భావరియె పండె!
అదె అదే స్వామి వేంచేసె, నదె, అతండె
అస్మ దానంద జలధి నీహార రోచి!

అయ్యయో! నీల మోహనమూర్తి కాదది
సాంద్ర కదంబకచ్ఛాయగాని-
అదియు చలచ్చంద్రకావతంసము కాదు,
చపల కిసాల మంజరియె సుమ్మ-
వినరాదొ మరల పిల్లన గ్రోవి కాదె, వె
దుళ్ళ పయ్యెర పరవళ్ల రవళి-
అది చిరునవ్వు కాదమ్మ, కొమ్మల సందు
లందలి వెన్నెల యలరు కనుము-
ఏటి బృందావనీ వాటి, ఏటి తరణి
నందనానందరాగ నిష్యంద గీతి,
ఏటి వ్రజపల్లి, అవ్వి ఏనాటి కథలు!......

— 'కృష్ణాష్టమి' నాటిక నుంచి

# జల ప్రళయం

దవ్వు దవ్వుల తరలి రెవరో,
రివ్వు రివ్వున కదలి రెవరో-
జలప్రళయం, జలప్రళయం!
మహావిలయం, మహావిలయం!

క్రుద్ధ రుద్ర జటాటవీ స
న్నద్ధ గంగా తుంగ భంగా
లెపుడు దుమికిన వో భువిపై,
ఏల యురికిన వో!

జలప్రళయం, జలప్రళయం!
మహావిలయం, మహావిలయం!

విలయకాలపు మృత్యువా అది,
ప్రళయ భైరవ నృత్యమా అది!,
మహంకాళీ పటు కరాళీ
చటుల కరవా లోగ్ర ధారా
పటల విద్యుద్వ్యూహ్నులా?

జలప్రళయం, జలప్రళయం!
మహావిలయం, మహావిలయం!

శబరియూ, మంజీర, కిన్నెర
చేతులూ చేతులూ కలిపేయ్-
జెబ్బలూ జెబ్బలూ కలిసేయ్-
లోతులూ నిండేయ్ - గౌతమి
పొంగి పొర్లింది!

జలప్రళయం, జలప్రళయం!
వరదలూ, వరదల్లు వరదలు

సుళ్లబడి పరవళ్ల విడి పరు
గుల్లవడి ఉరుముల్ల సడి నుర
గల్లు గ్రక్కింది - అదిగో
పుట్ల తొక్కింది - అరరే
గట్ల నెక్కింది!

వరదలూ వరదల్లు వరదలు

మిట్టు పల్లా లేకమై,
మిన్రు లోయలు ఏకమై-
పట్టణాల్పల్లెలూ దిగబడి,
కట్టలూ కాలువలు తెగబడి,
పిట్టలై మానవులు భయపడి
చెట్టు కొకరై లోకులై-
అర్ధరాత్రి ఇదేమి ప్రళయం!

జలప్రళయం, జలప్రళయం,
వరదలై పొంగింది గౌతమి-
వరదలూ, వరదల్లు, వరదలు!

తాను కడలికి తరలు తొందర,
కడలి తానై కదలు తొందర-
కడలి యేదో, గౌత మేదో!
ఏక మైనవి ఏడు పాయలు-
సప్త గౌతములా ఇవియే,
సప్త వార్నిధులా?

వరదలూ, వరదల్లు వరదలు!

గోడలా కూలేని, మరి, పెను
మేడలా రాలేని, అయయో!
గొడ్డుగోదం, పాడిపంటా
కొట్టుకొని పోయేని-అరరే!

కూలి పోతున్నాయ్-అయయో!
రాలిపోతున్నాయ్-
చెల్లచెదరై పిల్ల మేకా
చెదరిపోతున్నాయ్-అసువులు
బెదరి పోతున్నాయ్!

అయ్యయో అని అనే దెవరో,
అయ్యయో అన వినే దెవరో?

అర్ధరాత్రిని జలప్రళయం,
జలప్రళయం!

తల్లి గౌతమి మనసు నొస్తే,
పిల్లలకు గతి యేది తల్లీ?
అమ్మ గౌతమి ఆగ్రహిస్తే,
బిడ్డలకు దిక్కేది తల్లీ?

పిల్లలా లోపాల నెంచకు,
బిడ్డలా పాపాల నెంచకు-
పిల్లమేకా, పొలం పుట్రా
చల్లగా కాపాడు మమ్మా,
నిన్నె నమ్మిన వారమమ్మా!

కన్న తల్లీ వృద్ధ గౌతమి,
శాంతి శాంతీ శాంతి గౌతమి!

— 'గౌతమి' నాటిక నుంచి

# అతిథి శాల

తళుకు జలతార్ బుటా లద్దిన
నీలి వలయమ్మీ గుడారం!
చాల సుఖద మ్మీబిడారం!

పరం అపరం తెలియజాలం-
ప్రస్తుత మ్మిటనే బిచానా-
ఇంతలో ఎటుకో రవానా!

మౌల్ సెరీ జాయీ గులాబీ
మేల్ జుహీ చంపా చమేలీ!
మనకు చుట్టా లీ హవేలీ!

ఒక్క, షాయ్రీ - ప్రక్క ప్యారీ-
అవని అంతా మా గులిస్తాన్!
అతిథి శాలయె మాకు బుస్తాన్!

చేయి చెయి మెయి మెయి తగిలిచి
చెంతనే ఉండాలి ప్యారీ!
చెలియయే మా పాలి హూరీ!

పూవు లోపల మధువు లుంటే-
తీవ తీవ ఒయారి సాకీ!
తీర్చు వేగ సుకాల బాకీ!

పాచ్ఛా జలాల్ ప్యారీ జమాల్
మలుసందె వన్నెల వోలె రఝూటా!
మనకు సత్యం మధువు లోటా!

సుల్తాన్ ఫకీర్ నాబాబ్ గరీబ్
ఈ మన్నులో సర్వమ్ము మాయం!
ఉన్నదీ సారాయి ఖాయం!

ఏడిరా బైరాం హాతిం ఖైఖుస్రు
రుస్తుం అల సికందర్
పారెరా సమ్రాట్టు సీజర్!

నిన్న రాబో, దెల్లి రాలే
దన్న మాటిది సిసల్ ఖయ్యాం!
ఉన్నరోజే మనది హయ్యాం!

— 'అతిథిశాల' (ఉమర్ ఖయ్యాం) నాటిక నుంచి

# అనార్కలి

## (ముద్దు కృష్ణ 'అనార్కలి' వచన నాటికకు కృష్ణశాస్త్రి కూర్చిన స్వరమేళ)

రారమ్మ, రారమ్మ! మందారమా, రక్తకర
వీరమా, మాలతీ, మల్లికా, మాధవీ కన్యకా,
శేఫాలికా!

చలియించు నీ గుండె నిలుపలేనే లేవు
అలసి పోయిన వీణ పలికించనే లేవు
ఎటు లాలపింతువో ఈ సదస్యుల మ్రోల
కటికి రా నొగిలించు గాథ, తీయని బాధ
దానిమ్మపువు గాథ?

తోట తోటల నేలు మేటి ఆమని పాద
పీఠాన పడినదే పేద దానిమ పూవు!
ఏలాటి ప్రియుడో కెంగేల నిడి యువరాజు
లాలించునే గుండె బేల దానిమ పూవు!
పేద దానిమ పూవు!

తోట తోటల నేలు మేటి కాదే తాను
పాటించునో ఏమొ ప్రభువు లోకము మాట
తోటలన్నీ ముంచు మేటి కాదే వలపు
దాటగలడే ప్రియుడు దానిమ్మ పూపిలపు
దానిమ్మ పూపాట!

పోయినది దానిమ్మ పూవు,
తీయ తీయదనాల ప్రోవు!
మాయ భువిలో మరుగు ఎదలకు
మంచు జడులని లేనెలేవు- ||పోయినది||

లోక మంతా కాలమంతా
చీకు టిల్లై చీకు వాలై
ఏకమైతే మరుగు ఎదల శ
రత్తు లనునవి రానె రావు! ||పోయినది||

బ్రతుకులేమో భస్మమైనా
ప్రణయ మైనా బ్రతికి ఉంటే
స్వర్గ ముంటే మరుగు ఎదలకు
శాంతి సుఖములు దాటిపోవు! ||పోయినది||

— వీణ : ఫిబ్రవరి *1937*

# దీక్షితులన్నగారు

## (కృష్ణశాస్త్రి - ముద్దుకృష్ణమ్మ)

వింత భావాల్ వెతకడానికి,
వింత వ్రాతలు వ్రాయడానికి
చింతా దీక్షితు లొక్కడే మా
కెంతో నచ్చాదు.

కవి కుమారుడ నేనె అంటూ
కావ్యగీతా లల్లుకుంటూ
గీతమాలిక లంచ మిచ్చి
కన్య పట్టాడు.

తాళ వృక్షపు టెత్తునుండీ
దవ్వు దవ్వుల వింతలను మా
మూలు మానవ మాత్ర దృష్టుల
మించి చూస్తాడు.

నెమలి కన్నుల నీలి గప్పి!
వెన్నెలలతో వెల్లవేసీ
గట్టి మాటల పొదిగి ఇట్టే
ఇల్లు కడతాడు-

ఆ

ఇంటి ముందర తాను తన
వరహాల తల్లికి బువ్వ పెడుతూ
పాడుకుంటూ ఆడుతూ బా
జాలు పలికించు.

ఇంతలో శీతాచలోన్నత
శృంగ వీథులపై వరూథిని
నగ్నతకు ఒక మంచు తెలి వస
నమ్ము కడతాడు.

కాపు పడుచో, గడ్డి పువ్వో
ప్రళయ మధుర ప్రణయ తత్వము
ఒక్క పట్టే - చిటికెలో నొక
పటము కడతాడు.

బొల్లి భావా లొల్ల బోడు,
కల్లగీతా లల్లబోడు,
పొడుపు కథ బ్రహ్మాండ సత్యము
పొదిగి వేస్తాడు.

ఇంతకూ మాయన్న దెంతటి
ఘనతయో, కృష్ణమ్మ చేతుల
పొడుగు వెదురై తేనె తేటల
పులకరిస్తాడు.

- 'సఖి' ప్రథమ సంపుటం

# ఎందుకయా?

మూాడు కాళ్ల ముసలాడవు కాదా,
కోడె తలపు నీ కెందు కయా?
ఆడకూాతుళ్ల నడుమ అటూ ఇటు
ఆసుకండెలా ఎందుకయా?

ఎందు కయా నీ బొందగాని, బ్రతు
కెందు కయా, ఇబ్బంది కాని-
మోాడు చెట్టులాగున్నావే, వగ
లాడి వలపు నీ కెందుకయా?

పరతత్వంబులు పలికే నోటను
భడవాకూాతలు ఎందుకయా?
తిరిగి తిరిగి నీ నాలుక చివరను
పరతత్వంబులు ఎందు కయా?

భ్రాంతిగాని, ఒక గడియయేని, వి
శ్రాంతిలేని బ్రతుకెందుకయా?
మాకు వొద్దు బాబోయ్ అంటుంటే
ఏకుమేకులా గెందు కయా?

గుండె జబ్బుతో బబ్బుండక ఈ
మొండి పనులు నీకేల నయా?
అండ పిండ బ్రహ్మాండము లేలే
అయ్యను కొలువక ఎందుకయా?

# ఏరి జోలికి పోను

ఏరి జోలికి పోనులే,
　　　　నేనింక
ఏరి చెంతకు రానులే!
తేనె చినుకున వేలు పూనిపెట్టా నంతె-
　　మూగి చుట్టింది,
　　　రేగి కుట్టింది,
　　　　తేనె తుట్ట-
శిఖరాన చుక్కకై చేజాపితినా లేదా-
　　ఉరిమి కసిరింది,
　　　తరిమి ముసిరింది
　　　　జీబు మేఘం-
అలపైని నురుగు గుప్పిలికి తీస్తుంటేనె-
　　జడలు విప్పేసింది,
　　　అడలు పుట్టించింది,
　　　　దుడుకు కడలి!

# బురదలో పురుగు

బురదలో పొర్లేటి పురుగు
కరమెత్తి పయనమై వస్తే
గుళ్లల్లొ కోటల్లొ కుళ్లిపోయే స్వార్థం
త్రుళ్లి పడి ఒక్కటే పరుగు!

బురదలో పొర్లేటి పురుగు
శిరమెత్తి పరికించి చూస్తే
కొండపై మింటిపై కునుకుతున్నా దైవం
ఉలికిపడి క్రిందికీ ఒరుగు!

# ఆకలి

కాల దేవత గుండె ఒరిసి
కాళరాతిరి నెత్రు కురిసి
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

లోన -
వన్నె పోయిన రంగు దీపాలు
వెన్నెల్లో ఉన్మత్త నాట్యాలు
విసుగు పుట్టీ విడరు
వీను లుండీ వినరు
దగ్గరగ
దగ్గరగ
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

లోన -
రెక్కలెగరని నెమలి సింహాసనం
ఎక్కి సిరసందనిది కోటీరం
భారమైనా విడరు
చేరువైనా వినరు
బిగ్గరగ
బిగ్గరగ

రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

లోన -
రాణ పోయిన రాచనగరులో
పాను పంటని వేడి నిదురలో
మెలకు వొచ్చి వినరు
ప్రళయమొచ్చి విడరు
దగ్గరగ
దిగ్గరగ
చీకట్ల మూలుగు
రాకాసి యెలుగు!

పైన -
కాళరాతిరి గుండె పగిలి
కాల సర్పము విషము రగిలి
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

*

తమ కమృత ముంచుకొన్నారు,
తమ మధువు నించుకొన్నారు-
మాకు ఆకలి నిచ్చి!
మాకు రోషం హెచ్చి
మందాకినీ ఝురుల్
మరు గర్భమం దింకు వరకు!

తమ సొగసు వాడిపో దంట;
తమ సుకము వీడి పోదంట-
మాకు నాశం ఇచ్చి!
మాకు ద్వేషం హెచ్చి
మందార తరులు హే
మంత మసన మ్మొందు వరకు!

తమ ఘనత కృతయుగము దైతే,
తమ ప్రభుత బ్రహ్మాయు వైతే -
మాకు సంకెళ్లిచ్చి!
మాకు మానం వచ్చి
మఘవ కోటీరమే
మంటి కౌగిలి నంటువరకు!

— 'నిశ్రేణి' నుంచి

*

కోటి చేతులు చాపి
కాటకమ్మే తిరుగు
నేటి భారత భూమిలో
కాశికా స్వర్ణ సింహాసనాధ్యాసినీ!
కనికరమ్మేదమ్మ, కదలిరావేమమ్మ?

ఆశాశ లంటికొనె ఆకాశ మంటుకొనె
అరుణ కాల క్షుధానలములో
అమృత మధు కౌముదీ హాసినీ నా తల్లి!
అడరిపోవేమమ్మ, అరసిరావేమమ్మ?

నాల్గు దిక్కుల నడుమ వెల్గు బంగరునేల
        నాశమాయె మహాశ్మశానమై
వాసంత జీవ విన్యాసినీ నా తల్లి!
ఆసమాకేదమ్మ, అందిరావేమమ్మ?

కోటి చేతులు చాపి
కాటకమ్మే తిరుగు
నేటి భారత భూమిలో!

*1938 నాటి 'ఆకలి' మీద రేడియో ప్రసంగంలో ఉదాహృతము*

# నా కన్న పైవాడు

నాకన్న పైవాడు లేడురా!
పైన
నా కన్న తండ్రి ఒకడే రా!

నా కన్నపైవాడు నాక మందేవాడు,
నాకు చీకటి చీకు నరక మిచ్చేవాడు
నా కన్న పైవాడులేడురా!
పైన
నా కన్న తండ్రి ఒకడేరా!

నా మందు నెత్తు ప్రాణాలు త్రాగేవాడు,
నాకు మృత్యువు నోటి ఆకలిచ్చేవాడు
నా కన్న పైవాడు లేడురా!
పైన
నా కన్న తండ్రి ఒకడేరా!

మన్నుమిన్నుల నడుమ మబ్బు పరిచేవాడు,
కన్ననేలను వల్లకాడు చేసేవాడు
నా కన్న పైవాడు లేడురా!
పైన
నా కన్న తండ్రి ఒకడేరా!

# మాతృ మందిరం

ఆరని గాంగజీవఝురులై త్వదుదార దయా పయస్వినుల్
పారు నెడారి జీవితములన్, ఫలియించును, దేవ, స్వర్ణ కే
దార సజీవభాగ్యము, నితాంత నిశీథమునన్ జరించువా
రారయనేర రోరిచి, సమగ్రము యుష్మ దనుగ్రహ ప్రభన్.

*

మునిమాపు కనుచూపు మొరగు వత్సమ్ము నం
భా యని యొక సౌరభేయి చీరు!
కుతపాన నాకొన్న కూనకు బాలిచ్చు
జల్లు జల్లున నొక్క తల్లిమేక!
అడరు పిల్లకు వచ్చునందాక, వేబోక,
బులు గోర్తు తలిరాకు దలిమ మునుచు!

ఒక యమ్మ కన్నపాపకు నిండుచనుగట్టు
నెల్లరేయి పడకటిల్లు చేయు!
ఈ విధానమ్మునకు శిరస్సేను వంచి
ఈ యమర గేహ దేహళి యెదుట నిలిచి
రేలుబవళులు నిండే యదృశ్యజనని
యవతరించి యేలుకొనునొ యని తలంతు!

ఇది తల్లి హృదయమే యిందు యుగాలపే
రాకలి కొక యమృతాన్నమొదవు;

ఇది తంఁడ్రి ప్రేమాంక మిందు గల్పాల య
శాంతివో నొక క్షమాశయ్య యమరు;
ఇది మిత్రు నాశ్లేష, మిం దంతులేని యా
త్రికు నొకయభయహస్తమ్ము నడుపు;
ఇది రాజు నోలగ మ్మిందు దేజములేని
బ్రతుకున కొక కార్యరంగమొసగు;
ఇది యదార్ధ పూజాలయమ్మిందు, బిలువ
బలకరించు సజీవ దైవతము దొరకు
భక్తి నమ్ర శిరస్కులై, భావివేళ,
దెనుగువా రంజలెత్తి యాత్రికులు గాగ!

ఇది నంద నారామ మిందు బ్రాభాత మం
దార పూజాలతాంతములు వీరు!
ఇది కిన్నరీలోక మిందు బ్రదో షార్చ
నా వల్లకీ కీర్తనములు వీరు!
ఇది నాక మంటప మ్మిం దుజ్జ్వల వినమ్ర
నక్షత్ర నీరాజనములు వీరు!
ఇది యథార్ధ పూజాలయ మ్మిందు బిలువ
బలుకరించు సజీవ దైవతము దొరకు
భక్తి నమ్రశిరస్కులై భావివేళ!
దెనుగు వా రంజలెత్తి యాత్రికులు గాగ!

అహరహమ్ము పరంజ్యోతి రాలయమున
నమృతమూర్తి ప్రేమాంక శయ్యాతలమున
నధివసించు నీవా! బహిరంతరముల
నంధలోకాన నడగునేనా యనాథ?

నా యనుగు జెల్లెలా, తమ్ముడా యటంచు
నిన్ను బ్రతుకారగా బిల్వ నిమ్ము నన్ను-
మధుర శారద కౌముదీ మల్లి వీవు!
పరమ బాంధవు మంగళ స్వప్న మీవు!

ఇది నీ దెంతటి భాగ్యమో పరమయోగీంద్రుండు
కైసాచి, ని
న్నెద హత్తించుకొనున్ 'గుమార' యని యెంతే
కూర్మినిండార, నా
ర్ద్ర దయాదృష్టుల 'దల్లికాన' యని మీదం
జల్లి ని న్నాకు చా
ల దయావేలను గన్నవారి కిల యెల్లన్
గన్నవారే కదా!

మాకు శరణాలయమ్మిది; నీకు గూర్చు
తల్లి తండ్రియు, మనుచు పుట్టిల్లు సుమ్ము
నీకు వాత్సల్య మియ్యది, మాకు వరము;
సంతతివి నీవు, స్వామి యాచకుల మేము!

దారుణమౌ తపస్సున గదా తొలినా డొక మేటిరేడు భా
గీరధి దింపినాడు భువికిన్; మన యాంధ్ర
ధరిత్రికిన్ గృపా
పారగుడైన యా యవని పాలవరుం డెద
నిండి రాగ పె
న్ధారగ బంపినాడు కరుణాయమునా మధు రామృతమ్ము నే.

నేటి మన యాంధ్ర భువికి రెండే వరములు;
నాకముగ నరకమ్ము నౌనర్పగలుగు
నీ తపస్వి మహస్సు; ధాత్రీతలేంద్ర
వర్యు విస్తార సంసార వైభవంబు!

అచట బ్రహ్మర్షి హిమాచల శిఖరమ్ము
మస్తమ్ము యోగసమాధి వంచి;
ఇచట భూపాల దేవేంద్రుండు కనుదమ్ము
లం దశ్రులుగ హృదయమ్ము నించి;
అట చిన్ని బిడ్డ లాప్యాయమ్ముగా గూట
తల్లి రెక్కల మూతు లల్ల నుంచి,
ఇట సదస్యులు యాత్రకేతెంచి మేనులు
కుసుమ వల్లులుగాగ కోరగించి;
ఎల్లెడల దానయై యెట్టయెదుట దోచి
విశ్వలోక కుటుంబి సర్వేశ్వరుండు!
ఎటుల దొరకించు కొంటినోయేనునేడు
మౌని దుర్లభ మీ యపూ ర్వానుభూతి!

*కాకినాడ ఆర్.వి.ఎమ్.జి. రామారావు బహదూర్ అర్లనేట్*
*'డైమండ్ జూబిలీ' సూవనీర్ (24-1-1970) నుంచి*
*వ్రాసింది "సిల్వర్ జూబిలీకి"*

# హే ప్రభూ!

ఇచటనే నీ చరణ పీఠి; ఇచటనే ద
రిద్రు లందు పతితు లందు క్షుద్రు లందు
నీ పదమ్ములు కదలక నిలుచునోయి-

ఎంత వంచిన శిర మిది, హే ప్రభూ! ద
రిద్రు లందు పతితు లందు క్షుద్రు లందు
సాగు నీ పాదముల నందజాల దోయి-
నా ప్రణామమ్ము కరము వినమ్రః మయ్యు!

విగత భూషుడవై దీనవేషివై ద
రిద్రు లందు పతితు లందు క్షుద్రు లందు
నెప్పుడు నడయాడు నీ చెంత కేగలేదు
నా యహంకార మెంతటి దోయి, నాథ!

తోడు నీడవై నెచ్చెలికాడవై ద
రిద్రు లందు పతితు లందు క్షుద్రులందు
దడయుదువు నీవు; నీ సన్నిధానమునకు
నెన్నడేని రానోపునా యీ యెడంద!

— రవీంద్రుని గీతానికి అనువాదం

# ఏ జాతి వాడవో

ఏజాతి వాడవో బ్రాహ్మణుండవో
తేజమే చెడి దేవదేవు నడుగులను విడి!

బిగిసె సిగలో కులము, బిగిసె జందెపు త్రాళ్ల!
సగము క్రుళ్లితి కాని తెగదు తెగ దంటావు!

వాదు వద్దంటావు మీదు క్రిం దంటావు!
బీదసాదల ప్రభుని విడిచి మత మంటావు!

లోన చీకటి రొదలు, పైన ద్వేషపు గదులు!
వేదకాలము నాటి వెలుగు నా దంటావు!

# మా రాజు

మారాజు రాజ్యాన మాలతే లే రోయి
మా భారతమ్మింక స్వారాజ్య వ నోయి
నాల్గు దిక్కుల నడుమ నేల నింగికి నడుమ
మా రాజు దొక కొల్వు కూటమ్మురా, అందు
మా గుండె మా రాజు పీఠమ్మురా!

తరణి తారలు పైన తరళమణులు పదాన
మారాజు నకు మంచి మంచి నగలేరా
మా రాజు మెడను మేమే పూలమాలరా
మంత్రులా, కొలుచు సామంతులా, జానులా
మారాజునకు విశ్వమెల్ల ప్రజలేరా
మారాజు ఒడిలోన మసలు బిడలమురా!

*– 1920*

# ముందు నడుము సోదరా

ముందు నడుము సోదరా
ముందు నడుము సోదరా
తోడునీడ స్వామిరా
కూడ కూడ సాగురా

కర్మ మందు వీరుడవై
ధర్మ మందు ధీరుడవై
మర్మ మెరిగి మన యీశ్వరు
మందిరమ్ము దాక వీక-

భారతమ్ము మనదిరా
భాగ్యమంత మనదిరా
బ్రాహ్మణుడో, రాచవాడో
ప్రభుడు కూడ మాల రా!

చుక్కయన్న నేమిరా
చోద్యమంద నేలరా
ఒక్క దేవు డతని యరుత
నొక్క గడ్డి పూవెరా!

— హారిజన్ హోమ్స్

# వింత వార్త

రాజుగారి గౌరవమునకై ప్రజ
లందరు కూరిచి రొక విందు!
రాజుగారి రాజ్యములో పెద్దలు
రానివారు లే రెవరందు-
రాజుగారి కీర్తనమునకై కవి
రాజులు సవరించిరి గొంతు;
రాజుగారిపై విప్రుల యాశీ
ర్వచనములకు లేదే యంతు!
రాజుగారి కని గొప్ప గొప్ప నజ
రానాల్ కుప్పలుగా పోసి,
మహారాజుకై తలలు వంచి సా
మంతులు వేచిరి దయచేసి-
రాజుగారి పదములకై పరచిరి
రాసులు రాసులుగా విరులు;
రాజుగారి గళమునకై కూర్చిరి
రంగు రంగులా మణిసరులు!
రాజుగారి విందునకై వచ్చిన
రాణువ కపు డంతము లేదు;
రాజుగారి విందునకై, చిత్రము,
రాజుగా రొకరె రాలేదు!

మందిరమ్ములో, మంత్రాంగములో,
మంతనాలయములో జూడ,
నందరు పరుగిడి, రందరు వెదకిరి-
ఎందు దోచ దాయన జాడ!
రాజుగారి విందునకై వచ్చిన
రాణువ లెవరికి మతి లేదు;
రాజుగారి విందునకై, చిత్రము,
రాజుగా రొకరె రాలేదు!
అంతలో హజారములో ద్వారము
హఠాత్తుగా నెవడో తెరచి-
వింతవార్తతో, నడుగులు తడబడ,
విస విస జని, సభలో నిలిచి,
వింతవార్తతో, గొంతు వడకగా,
వినిపించెను తన కథనంత-
వింతవార్త విని సభవారు శిలా
విగ్రహముల వలె నైరంత!
"బూడిద బూసిన మేని తోడ తిరు
గాడు, నయ్యో, మన రాజే రాజె!
వాడలంట ముష్టిగూడతో తిరు
గాడు, నయ్యయో, రాజే రాజే!"
"దిక్కుమాలెనో, తెల్విపోయెనో-
తిరిపె మెత్తు నా రాజే రాజే!

ఎన్నడైన విన్నామా ఇట్టిది?
        ఇట్లు సేయునా రాజే రాజే?
వెంట వెంట బైరాగులేలో? నిరు
        పేదలేలో? తా రాజే రాజే!
అంటరాని వాడాయెనె చూడ
        అంటి పట్టుకున్న మన రాజే!"
మెల్లమెల్లగా తలలెత్తారు,
        మళ్లీ తలలు వంచారు-
వల్లకాటిలో వియోగులటు, తమ
        ప్రభువును కోల్పోయిన వారు!

– *1922* - హరిజన్ హోమ్‌లో వ్రాసినది

# అభినవ వేమన పద్యాలు

## - అవతరణం -

వెన్ను వాల్చి యెంత తన్నుకొన్నా గాని,
కన్ను మూత వడదు మొన్న రాత్రి;
మెలకు వసలె కాదు, కల బొత్తిగా కాదు-
మరపు కాదు, మరల మగత కాదు. 1

గదిలో మూలల మూలల
పొదివిన చీకట్లు ముదిసి ముదిసి కరుడులై
కదిసి హఠాత్తుగ బెదరుచు
చిద్రుపలు చిద్రుపలుగ చెదరి చెడినట్లయ్యేన్. 2

ఇరులు నిండిన గది యికిలించి నవ్వివ
ట్లొక్క మూల మెరసె నొక్క మెరుపు!
ఇంటి కప్పు నుండి యింతలో దిగజారె
వెలుగులోని కొక్క వేస మేదొ! 3

వాయినుండి దాని పాదాల వర కొండు
కారు దుబ్బు టడవి గడ్డ ముందు!
గడ్డిమేటి పైని కణకణ మని మండు
రెండు కన్ను లర్క మండలములు! 4

"ఎవడవోయి, బాబు! ఈ గదిలోనికి
ఎట్లు చొచ్చినాడ వీ నిశీథి?
మూసి యున్న తలుపు మూసియున్నది కదా,
బూచి యట్లు, పెద్ద భూత మట్లు" 5

అని యడిగితినో లేదో,
వినవచ్చె నెడంద యదరి ప్రీలి పడగ శ్రా
వణవేళా ఘనమాలా
స్వన హేలా స్ఫురణ మిరులు జడిసి యొదుగగాన్! 6

"ఎవడా కాని! ఔర! ఎరుగడా యుగము గా
భ్యుదిత కీర్తి నాంధ్ర హృదయవర్తి?
నన్నెరుంగ డేని తన్ను దా నెరుగునా,
తెన్గునాట ఎట్టి దిట్ట యేని? 7

"మూడు మలల నడిమి నాడులో నా పేరు
వినని వాడు మనియు మనని వాడు,
వీట వీట వీథి విపణి వేమన మాట
వినిన వాని కెదుట వెలుగు బాట!" 8

అదిరి పడితి అదవదలై
చెదిరిన కనుదోయి, చెవులు, చిత్తము కుదుటన్
కదియించు నంత వెలుగుం
బొద లెల్వడి మరల నురుము మ్రోత వినబడెన్- 9

అందరంద్రు నేల కందక నీ కనుల్
నింగి కేరుపరుచు నిచ్చెన లని!
నేనెరుంగు దోయి, నెచ్చెలీ! లోకమ్ము
దొలిచి చూచు బాకు తుదలవాని! 10

మూడుకోట్ల తెల్గునాడులో నినుమెచ్చి
వెడలి వస్తి నాటు వెలది తోడ!
పలుకు పలుకు మేలు కొలుపుగా నా పేరు
నిలుపుమా అనుంగు నేలలోన! 11

నవ్వింపు, నవ్వు, మరి మరి
కవ్వింపుము, కలచు, కనలు, గర్జింపుము, మై
దువ్వుము, రువ్వుము రవ్వల,
దివ్వెల వెలిగింపు తేటతెనుగు తెరువులన్! 12

ఎడద నీది పాలకడలిగా పొంగించు,
రసన నీది కత్తి కొస నొనర్పు
దయ దలంచు వాడె దండింపగల రేడు,
విశ్వదాభిరామ వినుర వేమ! 13

తలపులోన తళుకు, పలుకులో పరమార్థ
ముంచువాడు, పటిమ నించువాడు
కనగరాని నాడు పెను వల్లకా డయా,
విశ్వదాభిరామ వినుర వేమ! 14

అని సుంత ప్రక్క కొత్తిగి
లెను; ఆమని సందె వీవలిన్ తీవవలెన్
మును పసిడి మేను కదలన్,
కనుపించె తుటారి యాటకత్తియ వెనుకన్! 15

మెరపు, వెన్నపూస, మీగడ, చెక్కెర,
పాలకోవ, జున్ను, పూలతీవ
కలిపి చేసినంత తళుకుగా తీయగా
ఆరజముగ నున్న దా యొయారి! 16

ఆటవెలది కాలి యందియల్, కడియాలు,
కేలి కంకణాలు, కింకిణులును,
ఘల్లు ఘల్లు ఘల్లు ఘలు ఘల్లు ఘల్గల్లు
మనుచు మ్రోసె, నిరులు మరల మూసె! 17

నను నెచ్చెలి యని మెచ్చెను;
అనుగుం దెనుగుం జనాన కందీయగ దీ
యని తేనెల నా మది నిం
పెను; దింపెను ఆటవెలది పేరిమి కొలదిన్! 18

అర సున్న, లవ్యయమ్ము్మలు,
బరువైన- సమాసములు, విభక్తులు, సంధుల్
దరిసి కొలుచు తా వేంకయ
గురువరునకు నిరత మేటికో ళ్లిడు వేమ! 19

కుండలాల వారు పెండిలి పెద్దలు,
పించనయ్యగారి పెత్తనమ్ము-
వరుడు శకటరేఫ, అరసున్న వధు వయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 20

తరిచి తరిచి కోటి తాటాకు దస్త్రముల్,
చావగొట్టి చేసె శాస్త్రి గారు
గొప్ప గ్రంథ మొకటి గోమయ మంటించి!
విశ్వదాభిరామ వినుర వేమ! 21

ప్రణయ కావ్యములను పడదిట్టి పడదిట్టి
ఒడలు మరిచి శాస్త్రి ఒరిగి నంత,
చెరకు దీసి మరుడు చిదుక గొట్టాడయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 22

మెరుగు కంటిజోళ్లు, గిరజాలు, సరదాలు
భావకవికి లేని వేవిలేవు-
కవిత యందు తప్పు గట్టివాడన్నింటు!
విశ్వదాభిరామ వినుర వేమ! 23

మర ఫిరంగి బట్టి మహతిగా వాయించు,
చీమజూచి పరుగు చిత్తగించు-
అతడు కాక ఎవ్వ డతివాస్తవిక కవి?
విశ్వదాభిరామ వినుర వేమ! 24

నాటకాలలోన నారివేషము వేయ,
పురుషునట్టు లుండు పోతురాజు;
ఉత్త యపుడు సరిగ యువతీలలామయే!
విశ్వదాభిరామ వినుర వేమ! 25

జిగురు, ప్రత్తిమర, సిసింద్రి, సోడా పొంగు,
పేకజువ్వ, ధూళి, ఊకదంపు
కలిపి కొట్టి వాడు ఘన వక్తయైనాడు!
విశ్వదాభిరామ వినుర వేమ! 26

ఒక్క నోటుబుక్కు, ఒక రుక్కు, కవి వాక్కు
కలిపి రుబ్బి రుబ్బి అలికి అలికి
అతడు పీఠమెక్కి ఆచార్యుడయ్యెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 27

పాత దారు లందు ప్రథముండు కాలేక,
కొత్త తోవలందు గొప్పరాక -
అడ్డు పీత నడక అధికారి అయ్యెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 28

ఆజి వాజి పైని, అవల అందలముపై,
ధర్మ మిచ్చువేళ తఖ్తు పైని,
ఎక్కి ప్రజల మనసు కెక్కనప్పటి రాజు!
విశ్వదాభిరామ వినుర వేమ! 29

బంటు మీద నెక్కి ప్రభువరుం డైపోయె,
రైతు మీద నెక్కి దాతయయ్యె,
రమణి మీద నెక్కి రాజర్షియే యాయె!
విశ్వదాభిరామ వినుర వేమ! 30

రాజు తఖ్తునెక్కె, రౌతు బాబా నెక్కె,
పల్లకీల నెక్కె పండితుండు,
పిట్ట గోడ నెక్కె పిల్లారి నాయుడు!
విశ్వదాభిరామ వినుర వేమ! 31

పలుచ పలుచ పట్టు బట్ట కట్టెను రాజు,
మరియు సన్నబట్ట మంత్రి కట్టె,
బట్ట తీసివేసె బంట్రోతు తోచక!
విశ్వదాభిరామ వినుర వేమ! 32

పేరిరాజుగారు వీరవంశమువారు,
పౌరుషమ్ము జాస్తి; ఫౌజులేదు-
పోరుటకును కోడి పుంజు లున్నవి కదా!
విశ్వదాభిరామ వినుర వేమ! 33

కోడి పుంజు పందె మోడి, శ్రీదొరవారు
అమర పురికి పైనమయిరి కాని,
రెండు పనులకోస ముండిపోయారయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 34

ఒక్క సేరు మాంస మూదేయగల రయా!
ఏటి కొక్క బిడ్డ నిట్టె కందు-
రసలు యోధవరులు సిసలైన శ్రీ వారు!
విశ్వదాభిరామ వినుర వేమ! 35

పెద్దిరాజుగారు పెద్ద వంశము వారు,
పౌరుషమ్ము బోలె దూరుకోరు;
ఫౌజు లేదు కాని, కౌజు లున్నవి కదా!
విశ్వదాభిరామ వినుర వేమ! 36

ప్రొద్దు పోక బాబు బొబ్బిలి కథ విని,
గోడమీది బల్లె మూడలాగి-
ఒక్క కేక వైచి ఊరకున్నా రయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 37

సాని కవికి, బోడిదాని సన్యాసికి,
చలన చిత్ర తార చౌదరికిని
దాన మిచ్చి బాబు తాను వస్తున్నాడు!
విశ్వదాభిరామ వినుర వేమ! 38

దొరలు రాజుగార్లు తొందరపడినారు,
ఉరిమి గ్రుడ్లు తొడలు చరిచినారు;
మీస లొకరి వొకరు మెలిపెట్టి వేశారు!
విశ్వదాభిరామ వినుర వేమ! 39

ఉలవచారు తాగి ఉద్యోగి గుర్రమై
దౌడు తీసె, లద్దె తానెవేసె-
గుర్ర ముండి యుండి కుర్చీపై కెక్కెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 40

సిలువ గుండె పైన, నెలవంక తలపైన
మనసులోన ప్రణవ మంత్ర దీప్తి-
మతములేని వాడి మనుగడే మతమయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 41

బొట్టు కట్టు గూర్చి పట్టింపు లెక్కువై
శైవ వైష్ణవులకు సమరమైన
ఒకడు సున్నియయ్యె, నొకడు షియా యయ్యె!
విశ్వదాభిరామ వినుర వేమ! 42

నిదుర మత్తు లోన నీటుగా నామాలు
పెట్టె స్వామివారు పిల్లి నుదుట,
పిల్లి భక్తి పుట్టి చెల్లించె పులిహోర!
విశ్వదాభిరామ వినుర వేమ! 43

తలపులో విషమ్ము, పలుకులో రోషమ్ము,
నిలువు నిలువునాను నిండె మోస,
మయ్య మతము ప్రేమ, అతని ధర్మ మహింస!
విశ్వదాభిరామ వినుర వేమ! 44

అప్పుడు విష్ణుభక్తి, అప్పుడు శివభక్తి
బ్రహ్మ భక్తి యిపుడు బయలుదేరె,
ఒక్క దేవునకును చిక్కదు విశ్రాంతి!
విశ్వదాభిరామ వినుర వేమ! 45

సకల మతము లన్న చక్కని రుక్కులు,
ఎన్నొసుకవి వాక్కు లన్ని వచ్చు-
భక్త వరుని తెలివి బ్రహ్మకు లేదయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 46

పరవశమున భక్తు డరచి యేడువసాగ,
తెల్లబోయి బ్రహ్మదేవుడతని
నూరడింప లేక బారుమన్నా డయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 47

దివ్య గుణము లతడు తెగలాగి వర్ణింప,
తెల్ల తెల్ల పోయె దేవ దేవు
'డమ్మొ బాబో' యంచు, 'ఔను కాబో' లంచు!
విశ్వదాభిరామ వినుర వేమ! 48

ఆదివార ముదయ మభ్రంకషమ్ముగా
బ్రహ్మభక్తి ఆడి పాడి పొరలు,
ఇతర వాసరముల ఇసుమంత తడి కాదు!
విశ్వదాభిరామ వినుర వేమ! 49

తాను ముసల మాను, తాను తామర్లేను,
మణుగు దూది శత్రుగణము; లింక
ఏకె రంయి రంయి ఎందరో కాఫిర్ల!
విశ్వదాభిరామ వినుర వేమ! 50

అర్చనకును రాతి నాచార మిచ్చెను,
చచ్చు రాతి భార్య సంఘమిచ్చె;
కరకు రాతి కూడు దొరతనం బిచ్చెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 51

ఊసుపోక ఒక్క ఆసామి ఇల్లిల్లు
మాస మాసమునకు మార జొచ్చె-
ఇల్లు మారి నంత ఇల్లాలు మారునా!
విశ్వదాభిరామ వినుర వేమ! 52

పడమటూరి నుండి నడిరేయి జొరబడె
అతిథి - గగన మంత అతని నోరు,
బొజ్జ చూడ చూడ భూగోళ మంతయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 53

పంచదార కన్న పరదార తీయన,
రాజు కంటె మోజు రంకు మగడు;
ఐనదాని కంటె కానిదిమేలయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 54

పట్టుబట్టి గుడికి పదిమంది నేస్తాలు
పర్వదిన మటంచు పంపితేను,
అతడు కన్ను గొట్టె అమ్మవారిని జూచి
విశ్వదాభిరామ వినుర వేమ! 55

బాల్యమునను నరుడు, ప్రాయాన భక్తుండు,
కొంత వయసు ముదిరి గొప్ప జ్ఞాని-
అరువ దేండ్లు నిండి ఆబోతుగా మారె!
విశ్వదాభిరామ వినుర వేమ! 56

వీటిలోని మేటి విశ్వస్త లందరు
గొప్ప సభలు చేసి గోల పెట్టి
వెధవ పేట నొకటి వేరె యిమ్మన్నారు!
విశ్వదాభిరామ వినుర వేమ! 57

సదవధానులైరి, సచ్చైనులై రొక
తెల్లవారు సరికి ఎల్లయూరు
శాస్త్రికి మతిపోయి సన్నాయ డయ్యెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 58

చిట్టిగార్ల మీద సొట్ట బాబు మనస్సు
పడె, పలావు మీద స్వామి మనసు;
ఇరువురకును గట్టి తిరుబంధ మేర్పడె
విశ్వదాభిరామ వినుర వేమ! 59

సంధ్య వార్చి వార్చి శాస్త్రికి విసుగయి,
బూబు మీద మనసు పోయి పోయి-
తురక మతము పొంది దూదేకులాయెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 60

కత్తి వదలి రాజు కామిని చేపట్టె,
గంట మొదిలి మంత్రి గరిటె పట్టె;
వేసమునకు మిగిలె మీసాల దుబ్బులే!
విశ్వదాభిరామ వినుర వేమ! 61

పొట్ట కోసమమ్మి పట్టెడు మీసాలు
ఒక్క హోటలు పెట్టె నొక్క ప్రభువు
డబ్బు మరిడిదైన రుబ్బులు మంత్రివి!
విశ్వదాభిరామ వినుర వేమ! 62

వేద విద్య నాటి వెలుగెల్ల నశియించె
గారె, బూరె, పప్పు చారు మిగిలె;
బుర్ర కరిగి కరిగి బొర్రగా మారెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 63

కూటి కొరకు శాస్త్రి కుండలాలమ్మితే
సాయుబయ్యె వాని సంగ్రహించె;
ముసలి బీబి కవ్వి ముక్కెర లయ్యెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 64

ఆరువేల కొంప లంటించె అయగారు,
ఆరువేల వేలె అప్పు కలదు-
అతడు కాక ఎవ్వ డారు వేల నియోగి?
విశ్వదాభిరామ వినుర వేమ! 65

వీధి తోవ నెపుడు వేంచేయు పంతులు,
పెరటిదారి పందు లరుగు దెంచు;
తొందర పడి సాని పందినే వలచెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 66

సోమయాజిగారి జోలియ జూచితే,
పొట్టిసాని మనసు పట్టలేదు;
తండులములు లేక తటపటాయించింది
విశ్వదాభిరామ వినుర వేమ! 67

విసుగు పుట్టి ఒక్క వేపారి పంతులు
సానిదాని మంత్రసాని జేసె;
సాని విసుగు పుట్టి సాతాని జేపట్టె!
విశ్వదాభిరామ వినుర వేమ! 68

పదము పట్టినట్టు పాడును వేదాలు
జావళీలు చదువు సామ మట్లు;
సాని కొడుకె కాని శాస్త్రిది తప్పయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 69

తలిరుటాకు తోట నలుగురి భాగ్యంబు
కలకటేరుగారు కంచిమేక;
దళ్లు లేవు, లేవు తలుపులు వారికి
విశ్వదాభిరామ వినుర వేమ! 70

అతని కీర్తి శక్తులన్న ఒక్కని కేవ,
ఒకని కతని మీద ఓకిలింత;
ఉభయులంత కలిసి రొక భ్రాతృ కూటాన
విశ్వదాభిరామ వినుర వేమ! 71

తోడివారలెల్ల దొరలైరి ఘనులైరి
తానె మిగిలిపోయె గాన, వారి
తిట్టి తిట్టి బాబు గట్టి పండితుడాయె!
విశ్వదాభిరామ వినుర వేమ! 72

మేన ఖద్దరాయె, పైన టోపీయాయె;
తేకువాయె, నోట తీట యాయె;
చవట అంతలోనె సర్వజ్ఞుడైపోయె!
విశ్వదాభిరామ వినుర వేమ! 73

నోటి తీట వాడు మేటి నాయకుడాయె,
మేని వరుడు పనికిమాలి పోయె;
సింహమునకు గ్రామసింహమే గురువయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 74

"గండు రాళ్ళు మేతు, గాండ్రింతు గోండ్రింతు,
మొగ్గలేతు, నగ్గిపోతు" ననియె!
"స్వామి. ఎవర?" వంటి; "సామ్యవా"దన్నాడు!
విశ్వదాభిరామ వినుర వేమ! 75

ఆమెకున్న కలిమి ఆకలి కడుపైన
అతనికున్న యాస్తి అవిటికాలు-
ఇరువురకును నడుమ విరితూపు లెగిరెరా!
విశ్వదాభిరామ వినుర వేమ! 76

గూటి మీద నెక్కి సూటిగా కుక్కపై
విసిరినాడు రాయి, అసిరిగాడు;
కుక్క బొంయి మంటె గొల్లుమన్నాడయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 77

రాగి గాబు బాబు ర్యాక్షసి బొగ్గైన
అసిరిగాని తాత ఉసిరి కాయ;
ఎవరి గొప్ప వారి కెప్పటి కున్నదే!
విశ్వదాభిరామ వినుర వేమ! 78

తొస్సిపూడి, తాడి, తొండంగి, ముంగొండ,
లొల్ల, పూళ్ళ, దూసి, గుల్లిపాడు,
ఆముదాల వలస, అనమనయూర్లయా!
విశ్వదాభిరామ వినుర వేమ! 79